# పద్మవ్యూహం

ఏ ఆలోచనా, ఏవిచారమూ లేనిది వొక్క శాంతమ్మ మాత్రమే. దానికి మొగుడిమీద తలంబ్రాలు పోస్తున్నప్పుడూ, పల్లకిలో కూచున్నప్పుడూ భలే సంబరమేసింది. వాకిలిదగ్గిర నిలబెట్టి పేర్లు చెప్పమన్నప్పుడు, దానికి ఎంత వుత్సాహం వచ్చింది! "కిష్టారావు మామయ్యా, నేనొచ్చాను, తలుపు తియ్యండి!" అని సిగ్గుపడి చప్పున అక్కణ్నించి పారిపోయింది. సాయంత్రం మేజువాణీ అయిన తరవాత ముత్తైదువలందరూ వాళ్ళచేత గంధాలు పూయింప చేశారు. కిష్టారావు భార్యచేతికి గంధం రాశాడు. శాంతమ్మ మొగుడి బుగ్గలకు, మూతికి గంధం పూసింది. అందరికీ చూడముచ్చటేసింది వాళ్ళ సరసాలు.

కిష్టారావు యింటిలో చేరిన మూడుమాసాలకు శాంతమ్మ పెద్దమనిషి అయింది. దాని కప్పుడు పదమూడోఏడు రాబోతూ వుంది. ఏడాదిలోపల తీసుకొచ్చినప్పుడు చూడటం చూడటం, మళ్ళీ ఈ పండగప్పుడే శాంతమ్మ భర్తని చూసింది. అప్పటి కంటే పొడుగ్గా ఎదిగాడు. కొంచెం లావు కూడా అయ్యాడు. నల్లగా, వొత్తుగావున్న జుట్టు మొఖం మీద పడుతూ వుంటుంది అతనికి. ఆ పిల్లవాడు కాఫీతాగి, సిగరెట్టు కాలుస్తో నడవాలో పడకకుర్చీలో జారగిలబడి వున్నప్పుడు శాంతమ్మ వడ్లబస్తాలపక్కగానుంచుని, మొగుణ్ని చూసింది చాలాసేపు. ఎందుకనో దానికి అట్లా చూడబుద్ధేసింది. కనకమ్మ వొచ్చి కోప్పడిందాకా అక్కణ్నుంచి కదలనేలేదు.

మధ్యాన్నం భోజనాలయినతరవాత నారాయణ మూర్తిగారు అల్లుడికి కొత్తగుడ్డలు పెట్టారు. ఈ తతంగమంతా అయిపోయేటప్పటికి పొద్దుపోయింది! వేళమించి భోజనాలు చెయ్యటంచాత, అందరికీ పుబ్బుసబ్బులుగా వుండి నిద్రలకు పడ్డారు. ఎటుగూడీ మేలుకొనివున్నదల్లా, శాంతమ్మా, దాని మొగుడూను. కిష్టారావు ఏదో చదువుకొంటున్నాడు. శాంతమ్మ వూరికినే వుంది.

అతనికి దాహమేసింది. ఎవరిస్తారు? నిద్రపోతున్న అత్తా? మామా? నడవాలో కూచున్న పెళ్ళామా?

"శాంతా! కాసిని మంచినీళ్ళివ్వు" అన్నాడు కిష్టారావు కాసేపు తటపటాయించి. అతను భార్యతో మాట్లాడటం అదే మొదలు. శాంతమ్మ వెండిగ్లాసునిండా నీళ్ళు తీసుకొని గదిలో కొచ్చింది. స్వతహాగా శాంతమ్మ అందమయింది. సన్నగా చేప పిల్లకుమల్లే వుంటుంది. పెద్దకళ్ళు. తెల్లగా కొంచెం వొంపులు తిరిగిన ముక్కు. దాని పెదిమలు సన్నగా నెలవంకకు మల్లే వుంటాయి. శాంతమ్మ శరీరం మొత్తం వొకఎత్తు. ఆ పెదాలు రెండూ వొకఎత్తు.

కిష్టారావు మంచినీళ్ళు తాగి, గ్లాసు అడుగునవున్న నాలుగు చుక్కలు భార్యమీదచల్లాడు. శాంతమ్మ కోపగించుకొంది. అది కేవలం అభినయంకోసమేనని,అట్లాచల్లటం దానికి యిదిగానే వుందనీ, దాని నవ్వునుబట్టి సులభంగా తెలుసుకోవొచ్చు.

ఇంతకూ కాసేపు మాట్లాడితే ఎంతబాగుండును? అనుకొన్నది శాంతమ్మ. సరిగ్గా ఆసమయానికే కిష్టారావుగ్గూడా

అట్లాగే అనిపించింది. కాకపోతే భార్యతో ఏంమాట్లాడాలో ఆ తెలివితక్కువ సన్యాసికి చప్పున తోచలేదు. ఏమీ ఆలోచించుకోకుండా అతను భార్య చెయ్యిబట్టుకొని పక్కనే ఆనుకునేట్టు కూచోబెట్టుకొన్నాడు. అందుకు శాంతమ్మ చెప్పుకోదగ్గంత అభ్యంతరపెట్టలేదు—కాస్త సిగ్గుపడటం తప్ప. అదైనా ఎవరన్నా చూస్తారని!

"నువ్వు చాలా అందంగా వున్నావు" అన్నాడు కిష్టారావు. అంతకంటే మరొకటి అనటం అతనివల్ల కాకపోయింది పాపం!

"ఊఁ, పొండి. మీవన్నీ దొంగమాటలు" అన్నది శాంతమ్మ భర్త తనను-అనవసరంగా వుబ్బేస్తున్నాడన్నసంగతి గ్రహించినదానికి మల్లే.

"నిజం; దేవుడుతోడు; నువ్వు చాలాఅందంగావున్నావు" అన్నాడు మళ్లీ. శాంతమ్మ విశాలంగా చిరునవ్వు పెదిమల మీద వెలిగించి, భర్తముఖంలోకి చూసింది. కిష్టారావుకు ప్రాణం జివజివమంది. భార్యభుజంమీద చెయ్యేసి తన వేపు తిప్పుకొని "అమ్మదొంగా! ఎంతబావున్నావు నీవు" అన్నాడు.

కనకమ్మ ఏ ఆధారంతో అనుకుందో స్పష్టంగా తెలీదు గానీ, తనకూతురూ అల్లుడూ గలిసి ఏదో అఘాయిత్యం చేస్తారని గట్టిగా నమ్మింది.

కనకమ్మ కూతుర్ని పిలిచింది. గదిలోనించి విడవలేక, భిడియపడుతూ వొచ్చింది శాంత. తల్లి దాన్ని చిటుక్కున మాడుమీద కొట్టి "ఇదేమిటే కొంప ముంచుతావా యేమే? మేం నాలుగు కాలాలపాటు తలెత్తుకొని తిరగటం నీకు

యిష్టంలేదా ఏమిటి? ఈ దఫా ఆవైపు కెళ్ళు, చెబుతా. చర్మం వొలుస్తాను'' అన్నది కోపంగా.

ఇందులో తను చేసిన తప్పేమిటో శాంతకు తెలియ లేదు. ఒకసారి తను స్వయంగా విన్నది. సుశీల గదిలోకి పోనని పేచీపెడితే తల్లి కోప్పడి, బలవంతాన లోపలికి తోసి, బైట గొళ్ళెంబెట్టింది. తను ఎంత చిన్నదయినా ఆమాత్రం తెలుసుకోలేకపోదు. ఇప్పుడు మళ్ళీ అమ్మకు నెల తప్పిందట. మొన్న నాయనమ్మ ఎవరిలోటో చెబుతుంటే తను విన్నది.

ఆ రాత్రి అందరూ నిద్రలు పోయినతరవాత కనకమ్మ తనభర్తతో శాంతమ్మకార్యంగురించి చెప్పింది.

''ఇప్పు డేం తొందర? తరవాతచూద్దాంలే''అన్నాడు ఆయన.

''మీ కేం? మీరెన్ననా్న చెబుతారు. ఇంట్లో నే నెట్లా చస్తున్నానో నాకు తెలుసు, ఆ పరమాత్ముడికి తెలుసు. మరీ ఈ రెండురోజులనుండీ దాన్ని కనిపెట్టలేక నా ప్రాణం పోతోంది.''

''కిష్టారావు అంత తొందరపాటు మనిషని నే ననుకో లేను''

''అనుకోలేకపోతే మానెయ్యండి. ఆ అబ్బాయిసంగతి మీ కేం తెలుసు? ఆడది కనిపిస్తే కుక్కకంటే హీనమై పోతాడు'' అన్నది అల్లుడుసంగతి సాంగోపాంగంగా తెలిసిన దానికిమల్లే.

నిశ్శబ్దంగా వింటున్న కిష్టారావుకు ప్రాణం చచ్చి పోయింది. తన అత్త యింత లేకిమనిషనే సంగతి అత నింత

వరకూ అనుకోలేదు. ఆ తెల్లవారే కిష్టారావు వెళ్ళిపోయ్యాడు. పోబోయ్యేముందు శాంతమ్మను పలకరించి పోదామనిపించింది. కాని రాత్రి అత్త అన్నమాటలు జ్ఞప్తికి వొచ్చిన తరవాత ఆ కోరికను చంపుకొన్నాడు పాపం!

కిష్టారావుఇంటరుప్యాసయ్యాడు. కానిఅతనికాసంతోషం ఏమీలేకుండాపోయింది. తండ్రి చచ్చిపోయ్యాడు. కుటుంబ భారం మొయ్యవలసిన అవసరం కలిగింది. చదువు మాను కొన్నాడు. తల్లిగూడా బలహీనపడిపోయింది. ఇటీవల ఆమె బొత్తిగా యింటిపని గూడా చేయలేకపోతోంది. కార్యం ఏదో తూతూమంత్రంగా చేసుకొని భార్యను తెచ్చుకొన్నాడు.

ఇప్పుడు అతను నిజమైన జీవితంలోకి వొచ్చాడు. జీవిత మనేది ఊహించుకొన్నంత తేలికకాదని గ్రహించడానికి అతనికి ఎక్కువకాలం పట్టలేదు. తండ్రి బ్రతికున్నంతవరకూ డబ్బునుగురించి ఆలోచించవలసినపని కలగలేదు అతనికి. బతక టానికి తిండికావాలి. తిండికి డబ్బు కావాలి. నిజమే! మరి డబ్బుకు? ఏమిటి డబ్బుకు? ఎట్లా డబ్బు?

తండ్రి చావునాటికి మిగిల్చిపోయిన నాలుగువందల యాభైరూపాయలు కార్యానికీ, ఇతర ఖర్చులకూ పోను రెండు నెలలకంటె ఎక్కువ రాలేదు. ఇక తను చేయవలసిం దేమిటి? ఎట్లా తిండి తినటం? ఏంచేసి?

లక్షలాది నిర్భాగ్యుల నెదుర్కొంటున్న భయంకర నిరుద్యోగపిశాచం కిష్టారావునుగూడా తాకింది. ఉద్యోగం కోసం మానవుడు చేయగలిగిన ప్రయత్నాలన్నీ చేశాడు. ఇక మిగిలింది దైవ ప్రయత్నం. ఆ రోజుల్లో భయంకరంగా

యుద్ధం సాగుతున్నది. జపాను ఫాసిస్టు మూకలను ఎదుర్కొని తమ పెట్టుబడులను రక్షించుకొనే దానికి ఇంగ్లీషు పెట్టుబడిదారులు భారతీయులను విపరీతంగా సైన్యంలో చేర్చుకుంటున్నారు. తాము పోరాడేది ఎవరికోసం? ఎవరి రక్షణకు ఎవరి లాభాలకు? అన్న ఆలోచన వొక్క సైనికుడికీ లేదు. పుష్కలంగా జీతమిస్తున్నారు. జీతంకోసం యుద్ధం చేస్తున్నారు. వీళ్ళు డబ్బుకోసం ఆత్మల నమ్ముకొని, ప్రాణాలనుగూడా కోల్పోవలసివస్తోంది. ఎంతఘోరం!

కిష్టారావుకు కనిపించింది సైన్యంలో చేరటంవొక్కటే. ఈసంగతి తల్లితోనూ, భార్యతోనూ చెప్పాడు. వాళ్లు దీనికి చచ్చినా వొప్పుకోలేదు. "కాకపోతే కూలిచేసుకు బతుకుదాం" అన్నది తల్లి ఏడుస్తూ.

"పోనీ మాయింటికి వెడదాం రండి. కాస్త మంచి కాలం వచ్చేదాకా అందరం అక్కడే తలదాచుకుందాం. మా వాళ్ళయినా మరీ అంత లేనివాళ్ళేమీ కాదుగా" అన్నది శాంతమ్మ.

ఇది ఎవరికీ నచ్చలేదు. తిండికోసం అత్తగారింటపడి వున్నవాళ్ళ స్థితిగతు లెట్లావుంటాయో కిష్టారావుకు తెలుసు. ఎవరైనా దూరంగా వున్నప్పు డున్నంత గౌరవం దగ్గరకొస్తే వుండదు. కొండలు దూరంగా వుంటే నునుపు, దగ్గరకొస్తే రాళ్ళు, రప్పలు, ఎగుడు దిగుళ్లు.

అత్తగారింటికి కొడుకు పోవటాన్ని ఆమె ఎంతగా ఎదిరించిందో సైన్యంలో చేరటాన్నికూడా ఆమె అంతే నిరోధించింది. నిజానికి కిష్టారావుకుగూడా సైన్యంలో చేరటం ఇష్టం

లేదు. భార్య కాపరానికొచ్చి ఎప్పుడు? ఇటీవల. కనీసం ఆ మోజన్నా ఇంకాతీరలేదు. దానిముఖం చూస్తుంటే కిష్టారావు గుండె కరిగిపోతుంది. పుట్టింటివాళ్ళు తినాకుడవా వున్నవాళ్ళు. ఆకలి అనేది ఎటువంటిదో శాంతకు తెలీదు. తనను చేసుకొని అది నానాబాధలూ పడుతోంది ఒక్కోరోజున సాయంత్రం మూడుగంటలకు బియ్యంతెస్తాడు తను. అప్పటిదాకా యింట్లో వాళ్ళు అంతే, వుంటారు పాపం! తనూ, తల్లీ కష్టపడుతున్నా అట్టే బాధగాదు. పాపం! ఎవరో పరాయి అమ్మ కన్నది. దాని జీవితాన్నంతా తనకు ధారాదత్తం చేసింది. చేసుకొన్న నేరానికి కనీసం దానిని మనిషికిమల్లే అయినా చూడాలి తనేం చేస్తున్నాడు? నిజానికి ప్రాణాలుండటానికి కావలసిన తిండి పెట్టలేకపోతున్నాడు. ఎందుకు చేసుకొన్నాడు పెళ్ళి? జీవితం అగ్నిగుండంలాటిదని తనకు అప్పుడు తెలిసినట్లయితే... ఎందుకూ ఇప్పుడు అనుకోవటం? అనవసరం

ఎటుగూడీ ఆడవాళ్ళు తను మిలటరీలో చేరటాన్ని వొప్పుకోరు. చేరక తప్పదు. జీవన ప్రమాణం విపరీతంగా పెరిగిపోయింది. తను కష్టపడ్డా, చివరికి చచ్చినాసరే, బతికి వున్నంతవరకైనా వాళ్ళకు ఇంత తిండీ గుడ్డా ఇవ్వాలి; కన్న నేరానికి తల్లికి, ఇటువంటి దౌర్భాగ్యుణ్ని చేసుకున్నందుకుగాను పెళ్ళానికి. ఒకరోజురాత్రిఝాముున అతను ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయి సైన్యంలో చేరాడు.

తెల్లవారి మొదటగా చూసింది ముసలమ్మ. కాల కృత్యాలకు వెళ్ళాడేమో ననుకొంది. శాంతమ్మ మాత్రం

మరోవిధంగా ఎట్లా అనుకోగలుగుతుంది మొన్న రాత్రి తను ఏడ్చింది, కిష్టారావు మిల్ట్రీలోకి వెడతానంటే.

"నిన్ను విడిచిపెట్టి ఎక్కడకు పోతాను శాంతా? పోయినా నిన్ను తీసుకునే పోతాను" అన్నాడు కిష్టారావు. ఆయన అబద్ధమాడడని తనకి తెలుసు కాని ఆకలికి, దరిద్రానికి వున్న శక్తి వాగ్దానాలనేకాదు, మానవత్వాన్నే రూపుమాపుతుందని శాంత వూహించలేకపోయింది.

మధ్యాన్నానికల్లా కిష్టారావు అన్నంతపనీ చేశాడని వాళ్ళు నమ్మకతప్పిందిగాదు. లబ్బునమొత్తుకొన్నారు. ఘోలు ఘోలున ఏడ్చారు. శాంతమట్టుకు శాంతమ్మ నేలమీద పడి దొర్లింది, దుఃఖాన్ని సహించలేక! దరిద్రం ఎన్ని జీవితాలను, ఎన్ని హృదయాలను, ఎన్ని ప్రేమబంధనాలను సమూలంగా ధ్వంసచేస్తోంది!

నాలుగు రోజుల తరవాత బెంగుళూరునుండి డెబ్బయ్ రూపాయల మనియార్డరూ, ఒక వుత్తరమూ వొచ్చినై. కిష్టారావు ఏదో ఆఫీసరుగా చేరాట్ట. అన్ని ఖర్చులూ యిచ్చి తొంభై రూపాయలు జీతం యిస్తారట. తను యిట్లావొచ్చేసినందుకు ఏమీ విచారించవొద్దనీ, ధైర్యంగా వుండమనీ రాశాడు. ఆ వుత్తరం చదివినతరవాత మరోక్కసారి దుఃఖాన్ని వెలిబుచ్చి వూరుకొన్నారు.

శాంతమ్మ ఈ సంగతులన్నీ తండ్రికి రాసింది. మూడోనాటికల్లా నారాయణమూర్తిగారు వచ్చారు. అల్లుణ్ని చెడామడా తిట్టాడు. "భార్యకు తిండిపెట్టలేని వెధవలు పెళ్ళి చేసుకోవటం ఎందుకు?" అన్నాడు. తండ్రి తనభర్తను తిడుతుంటే

శాంతమ్మ సహించలేకపోయింది. నిజానికి తనభర్తంటే తండ్రి ఎందులోనూ వొక్కపిసరంతైనా ఎక్కువకాదు. సంపాదన చేతగానంత మాత్రాన వొకరి మానవత్వాన్ని, వ్యక్తిత్వాన్ని దుయ్యబట్టవలసిన పని గానీ అవసరంగానీ లేదు.

నారాయణమూర్తి పోతూ పోతూ కూతుర్ని రమ్మన్నాడు. శాంతమ్మ వెళ్ళలేదు. రానని ఖచ్చితంగా తెగేసి చెప్పింది. ఆయనగారు కోపంగా వెళ్ళాడు, శాంతమ్మ భవిష్యత్తును విధికి వొదిలి. తండ్రికి వుత్తరంరాసి శాంతమ్మ ఒకరకమైన ప్రశాంతతను వాంఛించివుంటే అది పూర్తిగా ధ్వంసమయిందని చెప్పక తప్పదు. అదివరకున్న స్థితికంటే తండ్రి వొచ్చి బాగుచేసిందిలేదు, పైగా తన మానసిక తటాకాన్ని అల్లకల్లోలం చేసి వెళ్ళాడు. నెల నెలా డబ్బువొస్తుంది. వారానికి రెండుమూడు వుత్తరాలు వొస్తుంటాయి. సంవత్సరంపాటు ఇట్లాగే గడిచింది. ఈలోపున కిష్టారావు వొకసారి వొచ్చి వెళ్లాడు సెలవుమీద.

యుద్ధం మరీ పెచ్చరిల్లిందని పత్రికలు వార్తలను మోసుకొస్తున్నాయి. జపానువాళ్ళు బర్మాను ఆక్రమించారు. ఇండియా సరిహద్దులమీద చెదురుగా దాడులు ప్రారంభించారు. కలకత్తా, విశాఖ, కాకినాడల మీద బాంబులువేశారు. దేశం సంక్షుభితమయిపోయింది.

బ్రిటిషువాళ్ళు సైన్యాలనన్నిటిని కీలక ప్రదేశాలకు తరలించారు. అమెరికానుండీ ఇంగ్లాండునుండీ అదనపు బలాలను దించారు. ఈ సమయంలోనే కిష్టారావు పనిచేస్తున్న బెటాలియన్ను లాహోరునుండి బర్మా రంగానికి ట్రాన్స్ఫరుచేశారు.

అందులో కిష్టారావు పనిచేస్తున్న సెక్షను చాలా చురుకైందని ప్రతీతి. కమాండరు దాన్ని అతిప్రాముఖ్యప్రదేశంలో నియమించాడు.

అందుచేత కిష్టారావునుండి వీళ్ళకు వుత్తరాలు రావటం తగ్గిపోయింది. నెలకో రెండునెల్లకో వొక వుత్తరం వొస్తుంది. డబ్బు నెలనెలకూ రావటంలేదు. రెండుమూడు నెలలకొకసారి—లేకపోతే అదీలేదు. మరీ కిష్టారావునుండి ఏవిధమైనజాబూ రాక ఆరునెలలయింది. వీళ్ళెన్నో రిజిష్టరుత్తరాలు రాశారు నెలరోజులకల్లా అవి తిరిగి వీళ్ళకేవొచ్చేవి. ప్రధానసైనిక కార్యాలయానికీ, యింకాయితరశాఖలకూ, కిష్టారావు భోగట్టాయిుంచి వాకబు చేశారు. ఎక్కడా అతని జాడ దొరకలేదు. ఢిల్లీశాఖవారుగావును 'అతన్ని బర్మారంగానికి పంపించామనీ, ఆ పటాలం మొత్తంమొత్తం ఏమయిందో తెలియటంలేదనీ' రాశారు. ఆ వుత్తరం చూసినతరవాత వీళ్ళ నడుములు బొత్తిగా విరిగిపోయినై.

శాంతమ్మ మళ్ళీ తండ్రికి వుత్తరం రాసింది. రాయటం నిజంగా ఆమెకు యిష్టంలేదు. అయితే రాయక తప్పలేదు. తండ్రికీ, గుడ్డకూ మళ్ళా యిబ్బంది వొచ్చింది. లోగడ కిష్టారావు పంపిస్తున్న డబ్బుతో పొదుపుగావాడి మిగిల్చి నాలుగు నాణాలూ, అతను పంపించని ఆరు నెలలనూ గడిపాయి. మళ్ళీ తమగతేమిటి? కూలికిపోవాలి, ఆ అణాలతోనే తనూ అత్తా బతకాలి. అత్త మరీ దిగజారిపోయింది. మనిషిగా కనిపిస్తుంది తప్పితే ఆమెలో వోపిక ఏసమెత్తయినా లేదు. ఏమిటి గతి?

నారాయణమూర్తిగారు వొచ్చారు. వీళ్ళ దుస్థితికి సానుభూతి చూపడానికి బదులు మండిపడ్డాడు. పరిస్థితు లిట్లా అవటానికి కారణం యావత్తూ కిష్టారావుదే నన్నట్టు మాట్లా డాడు. ఆయన లోగడ సంస్కారయినా, విజ్ఞానం యిక్కడ కించిత్తయినా వుపయోగపడలేదు. కొడుకుదిగులుతోనే జావయిపోతున్న ఆ ముసలిదానికి వియ్యంకుడి దెప్పిళ్ళు మరీ దెబ్బతీశాయి. అయినా పాపం! ఆమె చెయ్యగలిగింది యాడవటం తప్ప మరేమీలేదు.

నారాయణమూర్తిగారు తన కూతురును వొప్పించి తనవెంట తీసుకొచ్చుకున్నాడు. అసలు శాంతమ్మకు పోవా లనిలేదు. కానీ ఇక్కడవుండి చేసేదేమిటి? పోయినవాడు ఎటుగూడీ పోనేపోయాడు. తనెవరికోసం యీ గడపలో కాలుబెట్టిందో అతను లేడు. లేనప్పుడు తనకుమాత్రం యిక్కడవుండే హక్కు ఎక్కడుంది? ఏం బావుకు తినాలని తనిక్కడ వుండటం? ముష్టికొంప కోసం. అదికాస్తా ఆముసలి ముండ మనవరికి వొదలిపోతే బాగుంటుంది. ఇల్లుండి తిండి పెడుతుందా ఏమిటి? అయితే మరి ముసలిది? దానికిమాత్రం ఇల్లు తిండి పెడుతుందా? అది వేరు సంగతి.

శాంతమ్మ పుట్టింటికి వొచ్చింది. ఊళ్ళోవాళ్ళందరూ వచ్చి చూసి పొయ్యారు. వాళ్ళచూపులు చూస్తుంటే తనకు సానుభూతి చూపటానికి వొచ్చినట్టుగాలేవు. అపహాస్యం చేస్తు న్నట్టుగా వున్నై!

"ఏం తల్లీ వొచ్చావా? ఇన్నిటికీ రాతలే అమ్మా, రాత! పాపిష్టిబ్రహ్మదేవుడు అట్లా రాశాడు గామాలు. ఎంత

చక్కని ఈడు జోడు అనుకొన్నామమ్మా! ఏంలాభం?" మిగ
తాది మనసులోనే పూర్తిచేసుకొన్న దొక ఈడుదప్పిన ముత్త
యిదువ శాంతమ్మను పరామర్శించటానికొచ్చి.

శాంతమ్మకు ఏడుపొచ్చింది. తనరాత యిట్లా అయిందే
అనిగాదు: వీళ్ళంతా తనను అవమానిస్తున్నారే అని. నాలుగు
రోజులపాటు శాంతమ్మ ఆవూరివాళ్ళకు విచిత్రవ్యక్తయి
పోయింది.

ఆ పట్టు పట్టు ఆమె తిరిగి ఎన్నడూ అత్తగారింటికి వెళ్ళ
లేదు. కొంతకాలం మాత్రం వాళ్ళవల్ల వాళ్ళవల్ల ఆత్తగారి
క్షేమసమాచారాలను కనుక్కుంటుండేది. తిరువా తరవాత
అదీ మానేసింది. ఆమె అత్తగారు ప్రస్తుతం ఆవూళ్ళో లేదట.
మతి చలించి దేశాలమీదకు పోయిందట. ఆమె ముష్టెత్తు
కుంటుండగా ఎవరో చూశారుట. ఆయింట్లో ఆమె వారసు
లెవరో వుంటున్నారట ప్రస్తుతం. ఈవార్తలు శాంతమ్మని కది
లించవలసినంత ప్రబలంగా కదిలించలేదు. ఎవరో దూరబ్బం
ధువులకు వొచ్చినట్లుగా, వొక్క నిట్టూర్పు విడిచి వూరు
కొంది శాంతమ్మ.

నిజానిజాలు భగవంతుడికి తెలుసు. అంతా మాత్రం
శాంతమ్మభర్త యుద్ధంలో చచ్చిపోయ్యాడనే నమ్మారు,
చివరికి శాంతమ్మతో సహా! ఆమె మంగళసూత్రం నల్ల
పూసలు, గాజులు, తీసిపారేసింది. సన్నటిబంగారుగాజులు
తండ్రి చేయించిపెట్టాడు; తొడుక్కుంది. మెళ్ళో మూడుసెవర్ల
గోవర్ధన గొలుసు! కనీకనపడకుండా తిలకం పెట్టుకొంటుంది.
ఆమెను ఎవ్వరూ శుభకార్యాలకు పిలవటల్లేదు. పొద్దున్నే

ఎదురైతే ఘోరపిశాచంకనిపించినట్టు అదిరిపడి తిట్టుకుంటారు. చూస్తే దానికి నిండా పదహారేళ్ళుగూడా లేవు. అప్పుడే నూరేళ్ళజీవితమూ వెళ్ళబోసింది

ధర్మశాస్త్రాలు, పెద్దలు, ఆచారాలు ఎన్ని చెప్పినా శాంతమ్మలోని ఆశలు చావలేను. భర్త చచ్చినంతమాత్రాన అతనితో బాటే ఆశలన్నీ ఎందుకు చావాలో, ఎట్లా చస్తాయో అర్థంగాదు. మామూలుతిండి తింటూంది. మామూలు మనుషులతో తిరుగుతుంటుంది. ఆహారంగానీ, వాతావరణం గానీ మారలేదు. అటువంటప్పుడు మొగుడున్నరోజుల్లోవున్న కామం వాడు చావంగానే చావదు. కాకపోతే దిగులువల్ల కొంతకాలంపాటు ప్రజ్వలంగా లేకపోవాచ్చు. అంతమాత్రం చేత కామమనేదే వుందగూడదని శాసించటం ఘోరం.

పదోఏటనే శాంతమ్మ పెళ్ళికి వొప్పుకోవటానికిగల ప్రబలకారణాలు మనకు తెలుసు. కామక్రీడల్ని రహస్యంగా అనేకం చూపింది. ఉత్తరోత్తరా తనుగూడా అట్లాగేగావును అని మననంచేసుకొంటుండేది ఆ దృశ్యాలను - కిష్టారావు సైన్యంలో చేరిన తరవాత కొంతకాలం వరకూ ఆమె మనస్సు ఏవిధమైన వెర్రిపోకడలూ పోనిమాట నిజం. కాని కామం ...అది మహాశక్తిగలది. దాన్ని నిరోధించటం అసాధ్యం మహామహులకు సైతం. శాంతమ్మ మహామహులకాలేం గాదు. ఉప్పూ కారం తినే మామూలు మనిషి. భర్త సైన్యంలో చేరిన తరవాత యినపకచ్చడాలు బిగించుకొన్న దనీ, ఎక్కడా "తప్పుపని" చెయ్యలేదనీ ఘంటాపథంగా అన టానికి వీల్లేదు. ఎందుకంటె శాంతమ్మమామూలుమనిషి గనక.

నారాయణమూర్తిగారికి కొంతమంది కొన్ని సలహా లిచ్చారు. మరికొంతమంది "ఏమోనబ్బా! మీ యిష్టం.అయినా బాగా ఆలోచించండి. మీరు మాత్రం తెలిలితక్కువ వాళ్ళుకామగా" అన్నారు. బహుకొద్దిమంది మాత్రం "కానివ్వండీ! చదువుకొన్న మీబోటివాళ్ళే ముందుకు రాకపోతే ఇక సంఘం బాగుపడే దెప్పుడు?" అన్నారు. ఎవ రెన్నివిధాల చెప్పినా నారాయణమూర్తిగారు మాత్రం 'ఔ'ననో 'కాదు' అనో చెప్పటల్లేదు. కూతురు - పిచ్చితల్లి - అట్లా అఘోరిస్తో యింట్లో పడివుండటం తనకుమాత్రం సంతోషమా? జీవితాన్ని గురించి ఏమి తెలుసుకొంది? ఏమి నేర్చుకుంది? నాలుగు రోజులపాటు మొగుడుతో కలిసి వుండటమే జీవితం కాదు. దాని కింకా గొప్ప గొప్ప నిర్వచనాలున్నయ్.

కనకమ్మ ఈ విషయంలో ఎటూ తేల్చి చెప్పటల్లేదు. ఆమె మనసు పరిపరివిధాలపోతోంది. కామాక్షయ్యగారి శకుంతలను మొగుడు చిన్నప్పుడే చస్తే, జుట్టుగూడా తీయించి ఎవ్వరూ చూసి మోహించకుండా గావును, చాలాకాలం కాపాడాడు. ఆ ముండ కాస్తా కడుపుచేసుకూర్చుంది. వెంకమ్మత్తగారి సుబ్బులు వున్నట్టుండి మిషనువాడితో నైజాం లేచిపోయింది. రెండో పెళ్ళిచేస్తే యింతకంటే అవమానమేం గాదు. నిజమే ఆమాట. ప్రకాశరావుగారు అట్లా అని చేసి నందుకేగా, వాళ్ళింటికి మొన్న మొన్నటిదాకా ఎవ్వరూ భోజనాలకు పోనిది. తమయింటికి భోజనాలకు రాకపోవట మనేది, తలతీసేసినంత అవమానంగా భావించే జాతిలోది కనకమ్మ. శాంతమ్మకు రెండోపెళ్లి చెయ్యటం మంచిదో

చెడదో ఆమె తేల్చి చెప్పలేను. ఈ ముండ బుద్ధికలిగివుంటే; చెయ్యకుండా వుండటమే వుత్తమం. అయితే ఇది వుంటుందా అనేదే సమస్య. తన కిన్నేళ్ళు వొచ్చినా మొగవాడికోసం ప్రాణం పీకుతుంటుందనే సంగతి కనకమ్మకు ఆ సమయంలో తలపుకు రాలేదు.

మొగుడి దృష్టిలోనే గౌరవంలేని స్త్రీని, తలిదండ్రులు గూడా గౌరవించరు. మొదట మొదటలేదుగానీ, ఇటీవల కనకమ్మ కూతురును దెప్పటం ప్రారంభించింది. "నువ్వి ట్లాంటి దానివి గాబట్టే, ఆ మొగుడుముండాకొడుకు యుద్ధంలో కెళ్ళి హారీమని చచ్చివూరుకున్నాడు."

"అందుకే మనరాత యిట్లా తగలబడింది."

"కాకపోతే నువ్వు మంచి దానవటే! మంచిదానవే అయితే అందరితోబాటు నువ్వూ సలక్షణంగా వుండేదానివి. మరి మన కీ గతేమిటి?"

ఇత్యాది వచోబాణాలు కనకమ్మగారు కూతురుమీద ప్రయోగిస్తుంది. వంకాయలు కంౘెక్కటానికీ, ఎద్దులాంటి కడవతో నీళ్ళు తోడలేకపోవటానికీ, తన మొగుడు యుద్ధంలోకెళ్ళి చచ్చి, తనిట్లా వెధవరాలు గావటానికీ ఎక్కడ సంబంధం వున్నదో శాంతమ్మకు తెలియలేదు. న్యాయానికివి అత్తలు, ఆడబిడ్డలు అనవలసినమాటలు. తల్లి — కన్నతల్లి కూతుర్ని అనవలసినవి కావు.

నిరాదరణపు బ్రతుకు ఎంత నీచంగా వుంటుందో శాంతమ్మకు తెలిసివొచ్చింది. ఇటువంటి ఘటనలు జరిగినప్పు డల్లా ఆమెకు భర్త జ్ఞప్తికివొచ్చి కళ్లనీళ్ళపర్యంత మయ్యేది.

దుఃఖాన్నంతా లోపల్లోపలనే మింగుకొని ఘూరుకొనేది. బిగ్గరిగా ఏడవటానికి లేదు, తల్లి కోప్పడుతుంది. ఒకసారి ఏదో పండక్కి నరుసు చక్కగా ముస్తాబై, అయిపోతుంటే తను చూసింది. నరుసూ తనూ నాలుగురోజులవారగా పుట్టారు. అది ముందుపోతుంటే, దానిమొగుడు పిల్లవాణ్ణెత్తుకొని వెనక నడుస్తున్నాడు గుళ్ళోకి. ఆ దృశ్యం చూసిన తరవాత శాంతమ్మకు కడుపు తరుక్కుపోయింది. ఏడ్చింది.

"ఏం ? ఎందుకూ ఏడవటం! వీళ్ళంతా బతికిపొయ్యారనా! పండగపూట పచ్చనికొంపలో ఈ శోకాలేమిటే? ఏడ్చి ఏడ్చి అక్కడ సున్నంచేసివొచ్చావుగా యింకేం ? మళ్ళా యిక్కడకూడానా అట్లా" అన్నది కనకమ్మ కూతుర్ని. శాంతమ్మ కొయ్యబారిపోయింది. ఆ తరవాత ఎప్పుడూ ఆపిల్ల తల్లి చూస్తుండగా ఏడవలేదు. అంతగా ఏడుపొస్తే రాత్రిళ్ళు అంతా నిద్రపోయిన తరవాత వొంటరిగా కూచుని ఏడుస్తుంది. కాకపోతే ఎవ్వరూ చూడకుండా చాటుకెళ్లి ఏడుస్తుంది.

నారాయణమూర్తిగారికి ఏమీ పాలుపోవటం లేదు. ఆయన అడకత్తెరలో పోకలా నలిగిపోతున్నాడు. కూతుర్ని గురించి ఆయన పడుతున్న వ్యధ భగవంతుడికి తెలుసు. నిండా పదహారేళ్ళన్నా లేవు. అన్నీ జరిగిపోయినై. దాని మిగతా జీవితం సంగతేమిటి ? తను బతికున్నంతవరకూ దానికూటికీ, గుడ్డకూ లోపం రానీడు. తరవాత—తరవాత సంగతేమిటి ? అయినా మానవుడు వొట్టి తిండితిని జీవించలేడు. తిండితో

బాటు అతనికా-వలసినవి అనేకం వున్నయ్. తను చేతిలోపని గనక తిండిపెడతాడు. మరి మిగతా...?

కోర్టుపనిమీద గుంటూరు వెడితే అక్కడ శివరామయ్య కనిపించాడు నారాయణమూర్తిగారికి. మాటమీద మాటవొచ్చి వొకరిసంగతు లొకరు తెలుసుకోవలసివొచ్చింది. శివరామయ్యగారికి పదమూడెకరాల పొలం వుంచెట. భార్య చచ్చిపోయి నాలుగేళ్ళయిందట. ఆ తల్లిముండే, యేదో యింత వుడకేసి పడేస్తోందట. రెండోపెళ్ళిచేసుకోమని చాలా మంది సలహా యిచ్చారనీ, తనకూ చేసుకోవాలనే వుందనీ, కాస్త 'ఇది'గా వుండే సంబంధమైనా ఫర్వాలేదనీ అన్నాడు. నారాయణమూర్తిగారికి ఎందుకో సగంభారం తీరినట్లయింది. తను ఎటుగూడీ శాంతమ్మనుగురించి ఆలోచిస్తూనేవున్నాడు. మాటల్లో, కాయితాలమీదా తప్ప, ఆచరణలోకి చెప్పాకో దగ్గంతగా 'సంస్కరణ'రాని యీకాలంలో, శాంతమ్మకు మళ్ళీపెళ్ళి కావడం మాటలతో అయ్యేపనికాదు. అన్నీ సక్రమంగా వున్నవాణ్ని గురించి తను తాపత్రయపడటం అనవసరం. ఎందుకంటే అన్నీవున్నవాడికి 'వెధవరాలు'ను చేసుకోవలసిన అవసరం వుండదుగాబట్టి. శివరామయ్యకు కాస్త వయస్సుమళ్ళినట్టున్నాడన్నమాటే గాని నలభైఏళ్ళకు లోపుగానే వుండొచ్చు. తినా కుడవా ఇంతవున్నవాడు. రెండోపెళ్లి భర్తగాబట్టి పెళ్ళాన్ని కాస్తంత ఆపేక్షగాగూడా చూడవచ్చు. హాయిగా శాంతమ్మను ఇతనికిచ్చి ముడిపెట్టేస్తే ? అన్ని బెడదలూ తీరతాయి.

ఇంటికి కొచ్చినతరవాత భార్యతో తనమనసులోది చెప్పాడు నారాయణమూర్తి. కనకమ్మ కాసేపు గునిసి, చివరికి వొప్పుకొంది. నిజానికి శాంతమ్మను మళ్ళా పెళ్ళిచేయడం సుతరామూ, ఆవిడకు యిష్టంలేనిమాట నిజం. అదట్లాగే మనుసు కుదుటపడేసుకొని వుంటే బాగుండు. కాకపోతే ఏముంది ? తను చూస్తానే వుందిగా ఏమయ్యేదీనీ——

ఈ పెళ్లి నిజంగా పెళ్ళికిమల్లే జరగలేదు. రాత్రిపూట గప్‌చిప్‌గా సత్యనారాయణవ్రతం ముందు ఆకాస్తా అయిందని పించారు. శాంతమ్మ తన భర్త ముసిలివాడని పైకి గొణగ లేదు. తను అతనితో పొందగల ఆనందంగూడా ఏమీవుండ బోదని ఆమె వూహించింది. శాంతమ్మ అట్లావూహించటానికి గల కారణాలేమిటో స్పష్టంగా తెలీవు మనకు.

ఆమెకు పుట్టింటికంటే మరేయిల్లయినా హాయినిచ్చే స్థితిలో వుంది. అయినవాళ్ళందరితోటీ నిత్యం అవమానింప బడేదానికంటే, ముక్కూ మొఖం ఎరగని వూళ్ళో, ఏబాధలు పడ్డా అడిగేవాళ్ళుండరు. పూలమ్మిన వూళ్ళో కట్టెలమ్మ డంకంటే మరొకవూళ్ళో బిచ్చమెత్తుకోవటం ఎంతో మంచిది.

పెళ్ళయిన రాత్రి తెల్లవారుఝామునే, శాంతమ్మ కొత్త అత్తగారింటికి వెళ్ళింది. ఆమెకు తోడుగా దగ్గిరబంధువు లెవరూ రాలేదు. ఎవరో చాలాదూరపు బంధుత్వం కలసిన వొక వెధవావిడ మాత్రం వొచ్చింది. శివరామయ్య తరఫున గూడా ఎవరూలేరు; జీతగాడూ, వొకరిద్దరు ఆసాములూ తప్ప.

అత్తగారిల్లు చూసేటప్పటికి శాంతమ్మకు మనస్సు కాస్త శాంతిస పడ్డది. పెద్దలోగిలి. ఇంటినిండా ధాన్యపుబస్తాలు,

మిరపకాయల బోరాలు, వొకమూల వేరుశనక్కాయల రాశి
వుంది. శివరామయ్యతల్లి సుబ్బాయమ్మ, వాకిట్లోనే కొడుక్కూ
కొత్త కోడలుకూ, ఎర్రనీళ్ళు తిప్పి పారబోసి యింటోకి తెచ్చు
కొంది. ఆపూట వంటచేసింది ఆమెగారే. కానీ సాయంత్రాని
కల్లా శాంతమ్మ మడిగట్టుకొని వంటచెయ్యసాగింది.

ఒకటి రెండు రోజుల్లోనే శాంతమ్మ ఆ యింటికి పెత్తన
దారయింది. ఇంటినిండా చిందరవందరగా పడివున్న సామాను
లన్నీ సర్దింది. రెండు రోజులు నడుం పడిపోయేట్టు యింటి
బూజంతా దులిపింది. దిక్కూ మొక్కూ లేకుండా పడివున్న
ధాన్యబ్బస్తాలన్నీ వొక క్రమంగా పెట్టించింది. ఆ యింటి
కన్నాలన్నీ పూడ్చి, కాస్త దానికి కొంప ఆకారం తెచ్చే
టప్పటికి వారం రోజులు పట్టింది.

శాంతమ్మకు తనజీవితం వొకగాడిన పడ్డట్టనిపించింది.
శివరామయ్య అమాయకుడు. తెల్లనివన్నీ పాలూ, నల్లనివన్నీ
నీళ్ళూ అనుకునే తరగతిలోనివాడు. ఆయన కంటికి శాంతమ్మ
దేవతకుమల్లే కనిపించింది ముసలితనంలో కాస్త వుడకెయ్య
టానికీ, కాలూ, చెయ్యీ పడ్డప్పుడు కనిపెట్టి వుండటానికీ సరి
పోయిన మనిషేనని నిశ్చయమయింది. ఆమెను 'భార్య'
మోస్తరు శివరామయ్య చూడటం లేదు. అంతకంటే వున్నత
మయిన స్థానాన్నే అతనిలో ఈమె పొందగలిగింది.

అనుకోవలసినంత గొడవలేమీ జరగకుండానే మూడు
సంవత్సరాలు శాంతమ్మ సంసారం గడిచిపోయింది. ఈలోపుగా
కనకమ్మగారు రెండుసార్లు వొచ్చింది. ఒకసారి కూతుర్ని చూడ
టానికి, రెండోసారి పురుడుపొయ్యటానికి.

ఇంతకాలంలోనూ ఆమెకు కిష్టారావు జ్ఞాపకం రాక పోలేదు. కాస్త వయసులోవుండి, సుఖంగా వుంటున్న వాళ్ళను చూసినప్పుడల్లా, ఆమెకు కిష్టారావు జ్ఞాపకాని కొచ్చేవాడు. నిజానికి కిష్టారావు ఆమెను సుఖపెట్టి చచ్చిం దేమీలేదు. కూటికీ, గుడ్డకీ ముఖంవాచింది నానాయాతనా పడ్డది. అన్నికష్టాల్లోనూ ఎక్కడో సంతోషరేఖ వెలుగుతూనే వుండేది. రాత్రి పొద్దుపోయి వొట్టిచేతుల్తో కిష్టారావు వొచ్చి ఆమె దగ్గరగా కూచుని ఓదార్చేవాడు, "తనలాంటి భ్రష్టుణ్ని ఎందుకు చేసుకున్నావు? ఏం అనుభవిస్తున్నావు చేసుకొని? నన్ను కాకుండా డబ్బు కలిగిన మరొకణ్ని చేసుకొన్నట్లయితే హాయిగా సుఖపడేదానివి. నీజీవితాన్ని ధ్వంసం చేశాను..." అని విలపించేవాడు. అతని కష్టాలు చూసిన తరువాత నిజంగా ఆమెకు ఆకలయ్యేదిగాదు. అంతదరిద్రంలోను ఒక అసామాన్య మైన ఆనందం నిండుకొనివుండేది.

నిజానికి ఇక్కడ తనకు కష్టమేమీలేదు. కసీసం తననుఅదు పులోపెట్టేవాళ్ళుగూడా లేరు. తనెంత చెబితే అంత. అదే వేదవాక్యంగా శిరసావహిస్తారు అందరూ. శివరామ య్యంటే తనకు అసహ్యంగాదు. ఇష్టం. అయితే అది కిష్టా రావుమీదిలాంటిదిమాత్రం కాదు. కిష్టారావును ప్రేమిం చింది, శివరామయ్యను అభిమానించింది. కిష్టారావును ఆరా ధించబుద్ధవుతుంది. శివరామయ్యను చూస్తే జాలిపుడుతుంది అమాయకమైన కొడుకుమీద తల్లికి కలిగే జాలిలాంటిది. అనేకసార్లు ఆమె ఈ సంపదనంతా కిష్టారావుకు అంటగట్టి పోల్చిచూసింది. శివరామయ్యదగ్గరకొచ్చినకొత్తలో అతను

తన్ను అనుభవిస్తున్నప్పుడు, కృష్ణారావు బొమ్మను పూహించుకొంటూ వొకరకమైన కాల్పనికతృప్తిని పొందింది. ఇటీవల కొడుకు కలిగిన తరువాత బొత్తిగా అతనిధ్యాసే మరచి పోయింది. క్షణం తీరిక చిక్కటంలేదు. అందులో మరీ ఈ బొట్టికాయ వొట్టి అల్లరివెధవయినాడు. పూరికే గుక్కపట్టి ఏడుస్తాడు. వాడు ఏడుస్తుంటే శాంతమ్మప్రాణాలు గిలగిల లాడిపోతుంటాయి.

ఒకరోజురాత్రి, పిల్లవాడు ఏడ్చిఏడ్చి అప్పుడే నిద్రకి పడ్డాడు. కొడుకు నిద్రపోయిందాకా ఆగి శివరామయ్య పొలం లో నూరిపిళ్ళు జరుగుతుంటే వెళ్ళాడు. సుబ్బాయమ్మ దగ్గిదగ్గి జపంచేసుకొని వొకమూలన జారగిలపడింది. శాంతమ్మగూడా కొడుకు వొంటినిండా గుడ్డలు కప్పి, కళ్ళుమూసుకొంది. ఆమె కింకా సరిగా నిద్రపట్టలేదు. బయట చప్పుడయింది. కాసేపటి కల్లా తలుపుకొడుతున్నట్లుగా తోచింది, శాంతమ్మకు. ఆయన గారు పొలంపొయ్యారు. అర్ధరాత్రప్పుడు తమయింటితలుపు కొట్టే దెవరు ? శివరామయ్య అట్లొచ్చాడా ? రేపు మధ్యా హ్నానికిగానినూర్పిడి అప్పుడే అయిపోయిందా ! లేక శివరా మయ్య తనను పరీక్షచెయ్యటానికొచ్చాడా? ఇన్ని సంవత్స రాలకి తనను పరీక్షించటం ! శాంతమ్మ వెళ్ళి తలుపు తీసింది. ఒక భారీమైన మనిషి లోపల కొచ్చాడు. అతని ఆకారం, సాహ సం చూసి శాంతమ్మ భయపడింది. "ఎవరు ?"

"ఎవరు ? నేను ఎవరు ? గుర్తులేను. వుండను..."

అతనిగొంతులో అణచిపెట్టుకుంటున్న రోదనపుమర్మర ధ్వనులు.

ఆముదం దీపపు నీరస కాంతిలో, అతను సరిగా కనిపిం చటల్లేదు. ఇద్దరూ దీపం దగ్గిర కొచ్చారు. శాంతమ్మ దీపం ఎగదోసి, వత్తి సరిచేసి అతన్ని చూసింది. "మీరా!"

కొయ్యబారిపోయింది. అయిదేళ్ళకిందట చూసిన వాళ్లెవరూ అతన్ని కిష్టారావని చప్పున గుర్తించలేరు. శాంతమ్మ అతని కాళ్ళమీద తలపెట్టి ఏడుస్తూంది. కిష్టారావు ఏడవలేక కళ్ళప్పగించాడు.

కాసేపటికి శాంతమ్మ తలుపు గడియవేసి, అత్త ఏం చేస్తుందో చూసి, కిష్టారావుని వంటింట్లోకి తీసుకెళ్ళింది. స్నానం చేయించింది. అన్నం పెట్టింది. అతను తింటున్నంత సేపూ, దగ్గిర్నే కూచుని ప్రబలంగా చూసింది. ఎవ్వరూ మాట్లాడలేదు. ఇద్దరి కళ్ళవెంటా నీళ్ళు కారుతున్నాయి.

కిష్టారావు ఆఇంటినంతా చూశాడు మంచంమీద నిద్ర పోతున్న పిల్లవాణ్ణి చూశాడు. సంచిలోనుంచి నోట్లుతీసి దీపంముందు రాసిగా పోశాడు.

"నీకోసం, నిన్ను సుఖపెట్టేదానికోసం, నీతిండికి, గుడ్డకి, ఆనందానికి..."

శాంతమ్మ మాట్లాడలేదు. ఏంచేస్తుంది? కిష్టారావుతో, లేచిపోతుందా? తను ప్రేమించిన భర్తతో. తనసౌఖ్యం కోసం దేశాంతరగతుడైన మొదటి భర్తతో లేచిపోతుందా? తనమీద ఆశలుబెట్టుకొని, తనను దేవతలాగా చూస్తూ, ప్రబ లంగా అభిమానించిన శివరామయ్యదగ్గిరే వుండిపోతుందా? ఏం చేస్తుంది శాంతమ్మ? నోట్లు గాలికి రెపరెపలాడినై. పిల్ల వాడు మసిలి పక్కకు ఒత్తిగిలి పడుకున్నాడు.

# అపస్వరాలు

అతను రోడ్డుమీదకు చూశాడు. గుండె జెణికినట్లయింది. మెదడును ఎవరో గట్టిగా పట్టుకొని పిండుతున్నట్లయింది. ఒకజంట భార్యాభర్తలు గావుకు పోతున్నారు. వాళ్ళ భుజాలు తాకుతున్నాయి. భర్త భార్యచిటికెనవేలు పట్టుకొన్నాడు. భార్య కొడుకుచిటికెనవేలు పట్టుకొన్నది. అతని కళ్ళు మెరిసి చెదిరాయి. లోతుకు దిగిన జ్ఞాపకాలు వెలికి వొచ్చి కలవరపెట్టాయి. క్షణంలో ఆ ప్రదేశంలో తుఫాను రేగింది. బజారుల్లో చెత్తాచెదారము జిమ్మిన కొట్టుకుపోతున్నది. జనమంతా ఎక్కడివాళ్ళక్కడ సర్దుకొంటున్నారు. కార్లు బండ్లు, రిక్షాలు, ఇళ్ళుగూడా ఆ ప్రళయ ఝంఝకు కదిలి ఎటో కొట్టుకుపోతున్నాయి. పెద్దశబ్దం. భూమి, పచ్చిగోడలాగ నెర్రెలు నెర్రెలుగా విచ్చుకొంది. ఆ నెరియల్లోనుండి, పాముల్లాంటి నీళ్ళవూటలు బయలుదేరాయి. సూర్యకాంతికి ఆనీళ్ళు వెండి బిళ్ళలలాగా తళతళ మెరుస్తున్నాయి. కొంచెం సేపటిలోనే ఆప్రదేశంనిండా వొట్టికాంతులే మిగిలాయి. అతను 'అమ్మా!' అని అరిచి కళ్ళు మూసుకొన్నాడు. ఆతుఫానుకు ఆ పట్టణమంతా అతలాకుతలమయినప్పటికీ, అతనుమాత్రం చెక్కుచెదరకుండా, ఇంతసేపూ అట్లాగే నిలదొక్కుకొని వున్నాడు. ఆశ్చర్యమే!

...అతను కళ్ళు తెరిచాడు. ఎదురుగా మేడ కనిపించింది. దీనిచుట్టూ ఇనుపతీగెలవల. లోపలి పూలచెట్లు, వాకిలిదగ్గరి

ఇనుప అలపమీాది సన్నజాజులు పరిమళాలను ఎగజిమ్ము తున్నాయి. అతను లోపలకు వెళ్లాడు. వెడుతున్నప్పుడు వాకిట్లోవున్నమనిషి లేచి నమస్కరిస్తూ 'మీకోసం ఇందాక ట్నుంచీ ఎదురుచూస్తున్నాను శ్రీనివాసరావుగారూ;' అన్నాడు. శ్రీనివాసరావు ఇదేమీా వినిపించుకోలేదు. సరాసరి లోపలకు వెళ్ళాడు. కుర్చీలో కూచున్నాడు.

'ఇదిగోనండీ కాఫీ!'

అన్నది శాంత. ఆమె శ్రీనివాసరావు భార్య.

'వొద్దు.'

'ఏం?'

అన్నది నవ్వి. భర్త ఎందుకు కాఫీ వొద్దంటున్నాడో ఆమెకు తెలుసు. సీను— శ్రీనివాసరావు ముద్దుపేరు. భార్య వేపు చూశాడు. అతనికళ్ళు మెరిశాయి.

'మీానోటి కందించటానికి నాకు తీరికలేదుబాబూ! అవతల బోలెడుపనుంది' అన్నది శాంత లేనికోపం కనబరుస్తూ, అది వుత్తికోపమేనని సీనుకుగూడా తెలుసు. అందుకే అతను భార్యకోపానికి చలించలేదు.

'నాకంటే ఇంట్లోపనే నీకు ఎక్కువయినపుడు, నిరభ్యంతరంగా వెళ్ళి పనిచూచుకోవొచ్చు' అన్నాడు కొంచెం కష్టపడటు గొంతులో స్ఫురింపచేస్తో.

'అబ్బా! అన్నీ—పోకిళ్ళు, పోకిళ్ళయినా మీా... ఊఁ... పట్టండి, మీారు మరీ రోజురోజుకూ చిన్నపిల్లలై పోతున్నారు.. అదుగో... అందుకే నా కోపం మండుకొచ్చేది. పాపంగదా అని కాఫీ తాగిస్తుంటేనూ — ఏమి టా చిలిపిచేష్టలు...?'

శాంత బుంగమూతి పెట్టింది. బుంగమూతి పెట్టి నప్పుడు ఆమె అందం రెట్టింపుగా కనిపిస్తుంది సీనుకు. అందు కని అతను నవ్వాడు; నవ్వి శాంతను దగ్గరకు తీసుకొన్నాడు. తీసుకొని చప్పుచప్పున ముద్దుపెట్టుకొన్నాడు. అందుకు శాంత ఏమాత్రం అభ్యంతరం చెప్పలేదు.

మళ్ళీ గాలి వీచింది. ఆ గాలిలో ఆమెడకూడా కొట్టుకు పోయింది. ఆవేశానికి 'అతని' కళ్ళు తిరిగాయి. నెత్తురు పగిలింది. 'ఒహ్హో' అని ఛీత్కారంచేసి కళ్ళు మూసుకొన్నాడు.

...అతను కళ్ళు తెరిచాడు. అప్పటికి మధ్యాహ్న మయింది. లేచి వొళ్ళు విరుచుకొని భోజనానికి కూచున్నాడు. భార్య దగ్గరగా పీటవేసుకొని అతనికి కావలసినవి వడ్డిస్తున్నది. సీను వొకముద్ద సగం తిని మిగతాది భార్యనోటి కందించాడు.

"నాకొద్దు."

అన్నది శాంత ముఖం కొంచెం వెనక్కు తీసుకొని. అన్నం తినటం మానేశాడు. భార్యవేపు చూసి-

"ఎందుకని?" అన్నాడు.

"ఊఁ పోదురూ! మీ ఎంగిలి ఎవరు తింటారేం?" అన్నది పెదిమ కొంచెం విరిచి; అతని కళ్ళల్లోకి చూస్తూ, వొస్తున్న నవ్వును బలవంతంగా ఆపుకొంటూ.

"అట్లాగా"

అన్నాడు సీను—ఈసంగతి శాంతకు తెలీదు. అతను తెలియనివ్వలేదు కూడాను. తెలిసినట్లయితే-ఆమె ముందుగానే జాగ్రత్తపడగలిగేది ఉన్నట్లుండి సీను గబగబా కన్నులునుము కొంటున్నాడు.

"ఏమిటండీ?" అన్నది శాంత.

''కంట్లో నలకపడ్డది'' అన్నాడు సీను ఇంకా నులుము కొంటూనే.

"ఏదీ! నన్ను చూణ్నివ్వండి.''

అతను శాంతను చూడనిచ్చాడు. ఆమె చూడటానికి ముందు కొచ్చింది. ఒచ్చి కనురెప్పలు తెరిచింది. తెరిచి గట్టిగా వూదింది. సీను చప్పున భార్యముఖాన్ని దగ్గరకు తీసుకొని పెదిమలమీద ముద్దుపెట్టుకున్నాడు.

"ఛీఛీ" అన్నది శాంత పమిటతో పెదిమలు తుడుచుకొని.

"ఇందాక ఎంగిలి పనికిరాదంటివే! అమ్మో! ఇదంతా ఎంగిలికాదు గావును - ఏం?' అన్నాడు ఆమె ముఖంలోకి సూటిగాచూస్తూ.

'అందుకనే మీ రంటే నాకు మండుకొస్తుంది. పాపమనీ... పోదురూ... నే నసలు మీదగ్గిరే కూచోను.'

'ఐతే నే నన్నమే తినను.'

శాంత నవ్వింది. సీనూ నవ్వాడు.

మళ్ళీ గాలివీచింది. ఆగింది.

సన్నని వెన్నెల, పలచని గాలి, దానిమ్మచెట్టు నీడ క్రింద పెద్దమంచం. దానిమీద సీనూ, శాంతా పడుకొని వున్నారు.

'చందమామ ఎంత బాగున్నాడో చూడండి'అన్నది శాంత భర్త రొమ్ముమీద చెయ్యివేసి.

''అంతకంటె నీముఖం లక్షరెట్లు బాగుంది'' సీను రెండు చేతులతో భార్య ముఖాన్ని దగ్గరకు తీసుకొంటూ.

ఆమె ముఖం సంతోషంతో జేవురించింది. కళ్ళు మెరిశాయి. శరీరం గగుర్పొడిచింది.

'అన్నీ దొంగమాటలు' అన్నది శాంత భర్తక్రాపు లోకి వేళ్ళను పోనిస్తూ గోముగా.

'నిజం; నీతోడు.'

ఆమె కళ్ళుమూసుకొంది. అతను ఆమెకళ్ళను ముద్దు పెట్టుకొన్నాడు. ఆమె అతన్ని దగ్గరగా పొదువుకొన్నది.

'మన కొక పాపాయి వుంటే ఎంతో బావుంటుంది - కదండీ! –' అన్నది. అతన్ని కదిలిస్తూ శాంత.

''ఉండకపోవటం నాతప్పా! పోనీ నా లోటేమిటో చెప్పు. నే నేమన్నా...''

మధ్యలోనే.

'మీా కేమన్నా పిచ్చి పట్టిందా ఏమిటి?' అని అతని నోటిని చిన్నిచిన్ని వేళ్ళతో మూసింది శాంత.

గాలి వీచింది. బొమ్మలు చెరిగాయి. గాలి ఆగింది. బొమ్మలు వొచ్చాయి.

అతను రోడ్డుమీాదకు ఇంకా చూస్తూనే వున్నాడు. వయసులోవున్న ఆ భర్త, అందమైన అతనిభార్య, ముద్దులొలికే వాళ్ళ పిల్లవాడు వీధిమలుపు తిరిగారు. సీను నిట్టూర్పు విడిచాడు. రక్తమంతా జారిపోయినవాడిలా వున్నాడు.

'ఇదిగో! నిన్నే!! పలకవేం!'

అన్నది యింట్లోంచి భార్య. ఆమె కొంతకాలంనుండి భర్తను 'ఏమండి' అని పిలవటంలేదు. అతనుకూడా భార్యను "శాంతా" అని పిలవటం మానుకొన్నాడు. అందరూ అతన్ని సీనయ్యా—అనీ ఆమెను శాంతమ్మా అనీ పిలుస్తుంటారు. అయిదుగురుబిడ్డలు గలవాళ్ళను పట్టుకొని, ఇంకా ముద్దు పేర్లతో పిలవటమేమిటి కాకపోయినా?

"ఏమిటే! మళ్ళీ మొదలు పెట్టావూ నీ పాడుగోల? రామ రామ రామ! ఈ సంసారంతో ఛస్తున్నాను. భగవంతుడు నాకు చావన్నా రానివ్వడేం?' అన్నాడు సీనయ్య.

'చచ్చినా బాగుండిపోను, కొంపలో ఈ దరిద్రమన్నా లేకుండాపోతుంది. మొగదిక్కులేని సంసారమని నలుగురూ నాలుగుచేతులన్నా వూతమిస్తారు... ఇంకా కూచున్నావేం? ఇంట్లో బియ్యంలేవు. నిన్నా మొన్నా ప్లీడరుగారింట్లో అప్పు తెచ్చాను.'

'ఇంకా' అన్నాడు సీనయ్య.

'చింతపండు లేదు. కారంఐపోయి నాలుగురోజులైందని తెలుసుగా ?"

'తెలుసు. ఇంకా?' అన్నాడు సీనయ్య

'పెద్దవాడికి బడిజీతం కావాలట. పొద్దున్నించీ నాప్రాణం తోడుతున్నాడు. ఇవ్వాళ ఇవ్వకపోతే పేరుతీసేస్తారుట. చంటిదానికి పాలడబ్బా పట్టుకురండి. నిన్నసాయంత్రమే నీళ్ళు పోసి కడిగాను.'

'ఓహో' అన్నాడు సీనయ్య.

'ఇంటాయన వొస్తే ఇందాక కాళ్లుపట్టుకొని బ్రతమిలాడాను. సాయంత్రం ఇవ్వకపోతే, కుండా చట్టీ బైట వేస్తానన్నాడు.'

'కూరలవాళ్ళతోటీ, పాలమనిషితోటీ చెప్పలేక నా దుంప తెగిపోతున్నది. నామాటలు నమ్మటంగూడా మానేశారు— మరిచిపోయాను, 'రఘు'కు లివర్‌మందు సీసా కొనాలి. వాడి కడుపు మరీబానకుమల్లే పెరుగుతున్నది.'

సీనయ్య నవ్వాడు. జుట్టు పీక్కున్నాడు. చొక్కా చింపుకొన్నాడు. రెండుచేతులూ బాగా చాపి, అలాఇలా తిరుగుతూ 'హరోం హరహరహర మహాదేవ శంభో శంకరా' అని కేకలు పెట్టాడు.

'ఏమి టా వెర్రివాగుడు' అన్నది శాంతమ్మ చీదరించుకొంటూ.

'ఇది వెర్రిగాదే బుర్రుపిట్టా' అన్నాడు సీనయ్య పకపక నవ్వి.

'ఆనక నవ్వుకోవొచ్చు. ముందు వెళ్ళండి' అన్నది శాంతమ్మ.

'ఎక్కడికి?' అన్నాడు సీనయ్య.

'డబ్బుకు, వాడు బళ్ళోకి యింకాపోలేదు' అన్నది.

'మరీమంచిది. పెద్దవాణ్ణి బడి మానుకోమను. రఘుకు ఇంక రెండురోజులుపోతే రోగం పెరిగి వాడే చదుస్తా. పీడా వొదులుతుంది. చంటిదాన్ని ఎవరికన్నా అమ్ము, ఆడబ్బుతో ఈబాకీలన్నీ తీర్చవొచ్చు. నువ్వు మీపుట్టింటికి వెళ్ళు. నేను

రైలుక్రింద తలపెడతాను. ఈ క్రాస్‌వర్డ్ పజిల్‌కు ఇంతకంటే సాల్వేషన్ లేదు.'

శాంతమ్మ తలెత్తి భర్తముఖంలోకి చూసింది. అతని కళ్ళు నీళ్లు చిందుతున్నాయి. ముఖం ముడతలు పడ్డవి. జుట్టు తెల్లబడి, పలచనైపోయింది. క్రిందిపెదిమ పొడుగ్గా జారింది నడుము వంగిపోయింది. మలేరియారోగిలా వొణుకుతున్నాడు. ఆ స్థితిలో అతన్ని చూడలేక కళ్ళు మూసుకొన్నది. గతించిన తియ్యజ్ఞాపకాలు శిరస్సు లెత్తాయి.

—0—

# మేడిపండ్లు

ఆ పెళ్ళిచేసుకోవటం సావిత్రికి సుతరాము ఇష్టంలేదు. పెళ్ళిచూపులకని శ్రీపతి వొచ్చినప్పుడే, సావిత్రి వాణ్ని అసహ్యించుకొంది. వెంకట్రామయ్యకుగూడా, ఎంతమాత్రం ఇష్టం లేదు. ఎటుగూడీ, పీక్కుచచ్చిందల్లా మహాలక్ష్మమ్మగారే!

"నెత్తిమీద కానీ బెడితే ఏగానీ ఖరీదు చెయ్యడు. పేక, ముండలు, తాగుడు, దొంగతనం; యిన్ని అవలక్షణాలు గలిగిన అయ్య పెళ్ళానికి కూడు పెడతాడని, పెట్టగలడని నమ్మక మేమిటి? తెలిసి తెలిసీ, దాని గొంతుకొయ్యటం నే నొప్పుకోను. సావిత్రి నాకేగాదు, నీకూ కూతురే! ఆలోచించుకో! తరవాత నీ ఇష్టం" అన్నాడు వెంకట్రామయ్య.

"ఇష్టాయిష్టాలేమిటీ యిందులో? అది సరిగ్గా కాపరం చెయ్యటం, మీ కొక్కరికే యిష్టమైనట్లు, నాకు కానట్లూ మాట్లాడతారేం? చిన్నప్పుడు అంతా అట్లామిటుకినోళ్ళే! మీ మట్టుకు మీ సంగతేమిటో చెప్పండి? నలుగురు బిడ్డలతండ్రి అయ్యారుగదా? ఇంకా ఆ మాణిక్యంతో, ఆ వికవికలు, పకపకలూ, ఆ మురుసుకోవటం... ఏమిటిదంతా? కుర్రతనం—ఏదోగడ్డితిన్నాడు. నోరు కడుకొన్నాడు. ఎల్లకాలం ఆ బుద్ధులే వుంటాయా యేం? పెళ్ళాం కాపరానికివొచ్చినతరవాత అన్ని రోగాలు, తాక్కున కట్టడిపోతాయి. వాడి కేమండీ? నిక్షేపరాయుడికిమల్లే బిడ్డముంటేనూ! వేలకువేలు కట్నాలు గుమ్మరించినా మొగసనివాళ్ళు చిల్లికానీ తీసుకోకుండా చేసుకొంటామన

టమే పది వేలు. ఇంతకంటే మంచివాణ్ణి మీరు తీసుకొస్తారే, నే చూస్తానే" అన్నది మహాలక్ష్మగారు. వెంకట్రామయ్య ఇంకేమీ మాట్లాడలేదు. "మీరూ మీరూ కట్టకట్టుకొని ఆ గంగలో దూకండి. నాకేం సంబంధం లేదు" అని తాత్కాలికంగా అస్త్రసన్యాసం చేశాడు.

పీటలమీదికి రాబోయ్యేవరకూ, సావిత్రి ఏడుస్తూనే వుంది. పేరంటాళ్ళు పసుపు పూస్తే చెరిపేసుకొంది. బుగ్గనకాటిక పెడితే తుడిచేసుకుంది. పీటలమీదకూచున్న దానివాలకం చూస్తుంటే, 'పెళ్ళి చేసుకోబోతున్నాను' అనే వుత్సాహం ఏ కోశానా కనబడదు. మహాభయంకరాపదలోకి బలవంతాన తోయ్యాబడుతున్నదానికి మల్లె వుంది.

మూడుముళ్ళూ పడ్డయ్. మహాలక్ష్మగారి ప్రాణాలు కుదటబడినాయి. అంతవరదాకా, ఆమెను గుండె 'పింజం పింజం' అంటూనే వుంది. సావిత్రిసంగతి ఆమెకు తెలుసు. సరిగ్గావున్నదా సరేసరి. సరితప్పిందో దానిమాటకు ఖోకాలేదు. గత నాలుగురోజులనుండీ,కూతుర్ని కాపాడలేక ఆమె ప్రాణాలు పోతున్నయ్. అంతవరకూ రాదనుకో; అధవా ఈ భడవా ముండ తెగించి, ఏ కాలవలోనో, బావిలోనో దూకితే!

వెంకట్రామయ్యగూడా, ఆ శాస్త్రకార్యమూ, ఘనంగానే జరిపించాడు. మొదట్లో ఎంత అసహ్యించుకొన్నా, చివరికి అభిమానించక తప్పిందిగాదు. ఐనా అసహ్యించుకొని తను చేయగలిగిందిమాత్రం ఏ ముందిగనక ? పెళ్ళయిపోయింది. ఆరోజునే కార్యంగూడా ఐపోయింది.

కార్యంరోజున మహాలక్షమ్మగారు మళ్ళా కాస్త బిడియ పడింది. శ్రీపతంటే యిదివరకుమోస్తరు, ఈ నాలుగు రోజులూ, సావిత్రి అసహ్యించుకోనిమాట మాత్రం నిజం. అయితే అభిమానంగూడా చూపలేదు. స్తబ్దుగా వూరుకొంది. తల్లి చెయ్యమన్నట్లల్లా, రుంజుకొంటూనో, గింజుకొంటూనో చేస్తూనేవుంది. ఈ రోజు సంగతేమిటి? ఇది గదిలో సరిగ్గా మిడికేడుస్తుందా? నానారద్ది చేస్తుందా? కూతురుస్వభావం తెలిసిన మనిషిగనక; మహాలక్షమ్మగారు యిట్లా ఆలోచించ వలసివొచ్చింది.

ఆమె ఆలోచన వృథాపోలేదు. సావిత్రి వోపట్టాన, శ్రీపతిని చెలకట్టనియ్యలేదు. వాడు మహా 'ప్రేమ'తో తమల పాకులు కొరికి న్నోటికందిస్తే విసిరి పారేసింది. గోవరనగొలుసు మెలికబడితే; పాపం! దాన్ని సర్దుదామని చూసేసరికి గింజు కొని, దూరంగా పోయింది. ఇదంతా గమనిస్తున్న మహా లక్షమ్మగారికి, అంతమంది ఆడంగుల మధ్యా ప్రాణంచచ్చి వూరుకొంది. కూతుర్ని పిలిచి, నాలుగు చీవాట్లు వేసింది. అల్లుడికి చెప్పవలసినయ్యేమిటో చెప్పింది... కాసేపటికి అంతా సర్దుకొనిపోయిందు. తెల్లవారి సావిత్రిని దొడ్లో చూసింతరవాత ఆమెగారి ప్రాణానికి "ఇక తిరుగులే"దంది.

కుక్కకు నెయ్యికూడుయిమడదు. ఇదెంతో నగ్నసత్యం. కార్యమైన నాలుగోనాడు, శ్రీపతి వేలి వుంగరం అమ్మి, 'ఫిల్టర్' ఆడొచ్చాడు. అవ్వేళ ఎవరి ముఖం చూశాడోగాని, వొక్క ఆటగూడా తను తిప్పిన పాపాన పోలేదు. మూడు గంటలకు దూసుకుపోయి, ఇంటికొచ్చి పడ్డాడు. ఆ పగలల్లా

ఎవరూ కనుక్కోలేదు. రాత్రి పడుకోబొయ్యేముందు సావిత్రి అడిగింది.

"మీచేతి వుంగరం యేదీ?"

"ఒక స్నేహితునికి ఎరు విచ్చాను" అన్నాడు శ్రీపతి తొణక్కుండా. అట్లా అన్నందుకు తననుతానే అభినందించుకున్నాడు తరవాత.

"శేష్ట్రు అడిగితీసుకోండి. ఈ కాలంలో ఎవణ్నీ నమ్మటానికి వీల్లేకుండావుంది" అన్నది సావిత్రి. ఆమె కెందుకనో ఆవుంగరం ఎరువియ్యలేదనే అనుమానంకలిగింది. అందుకనే ఆ వుంగరాన్నిగురించి పాటికి పదిసార్లు హెచ్చరించింది సావిత్రి.

నిజం దాగదు. ఒకప్పుడు గాకపోయినా వొకప్పుడైనా అది బైటపడితీరుతుంది. శ్రీపతి యీ విధంగా వుంగరాన్ని ధ్వంసంచేశాడని ఇంట్లో అందరికీ తెలిసింది. వెంకట్రామయ్యగారు కొంచెం గట్టిగా కేకలేశాడు.

"అది నా వుంగరం. మీరు చేయించిందేననుకోండి. నాకు పెట్టిన తరువాత అది నా సొమ్మే! నా సొమ్మును నేను అమ్ముకుంటాను, అర్చుకుంటాను. అడగడానికి నువ్వెవరు? నీ కేం అధికారం వుంది? అంతచేటు ఆరాలుతీస్తావని తెలిస్తే అసలు నేను తీసుకోకేపోదును. ముష్టిమూడుచిన్నాల వుంగరం ఏమిటో చేశానని మీరు గొంతుపగిలేట్టు అరవనక్కర్లేదు. కావాలంటే రెండమూడురోజుల్లో పారేస్తా" నన్నాడు శ్రీపతి అంతకంటే ఏమాత్రమో గొంతుపెంచి. వెంకట్రామయ్య ఇంకేమీమాట్లాడలేదు. మహాలక్షుమ్మ గారు మాత్రం

కాస నొచ్చుతుంది. అయినా శ్రీపతి అదేభావాన్ని 'అంత కంటే తక్కువభాషలో' మృదువుగా అన్నట్లయితే, ఆ కాస్తం తయినా నొచ్చుకొని వుండదు.

న్యాయానికి రెండోరోజున శ్రీపతి వుంగరం తీసుకు రావాలి. తీసుకొద్దామనే వుద్దేశంతోనే పాపం "మూడు ముక్కల్లో" కూచున్నాడు. ప్రస్తుతం శ్రీపతిగ్రహాలు ఎదురు తిరిగినయ్యాలేవుంది. పట్టుధోవతి అమ్మిన యాభై రూపాయలు కాళ్ళొచ్చినట్లు మాయమయిపోయినై. పగలల్లా అతను ఇంటికి రాలేదు. రాత్రి అందరూ అన్నాలుతిని, ఇతనికోసం చూసి చూసి, నిద్రలుపోయినతరువాత, పిల్లిలాగా ఇంట్లో జొరబడి భార్యపక్కలో పడుకున్నాడు. సావిత్రి ఆత న్నేమీ అడగ లేదు. ఒక్కసారి దీర్ఘంగా నిట్టూర్పు విడిచి "తలనొప్పిగా వుంది" అని కిందచాపేసుకొని పడుకొంది. ఇద్దరూ చాలా రాత్రివరకూ మేలుకొనే వున్నారు కానీ ఎవరూ పలకలేదు.

కార్యానికనివాొచ్చిన శ్రీపతి ఆకాస్త మొక్కుబడీఅయిం తర్వాతనైనా ఇంటికి జేరలేదు. ఈలోపునే మరికొన్ని రహస్యాలు వెంకట్రామయ్యగారికి తెలిసినై. ఆ ఆస్తికాస్తా తల్లిపేరవున్న దనీ, తల్లికీ పీడికీ నిప్పులో ఉప్పేసినట్లుగా వుంటుందనీ, కార్యం దాకా వుండకుండా లగ్నమయిన మర్నాడే ఆమె యింటికి వెళ్ళిపోవటానికి కారణం యిదేననీ తెలిసింది. కొడుకు పెళ్ళికి పట్టుమని నాలుగునాళ్ళయినా వుండని భాగ్యశాలి, కొడు కుని నమ్మి ఆస్తి పీడిపేరబెడుతుందని వెంకట్రామయ్యగారు నమ్మలేక పొయ్యాడు. తరవాతనైనా పీడికిస్తుందని నమ్మక మేమిటి? ఆ సమయానికి గొంతులోయిన్ని తులసినీళ్ళు ఎవరు

వొదిలితే వాళ్ళకిస్తుంది. తన కొడుకువిషయం తెలియని మనిషి గనకనా, ఆమెకు నాలుగు బులిబుచ్చికం కబుర్లు చెప్పి, పనివెళ్ళమార్చుకొంటానికి ?

ఆదిలోనే హంసపాదన్నట్లు, పదహారు రోజుల పండగ వెళ్ళేలోగానే ఆగభోగాలుగా తయారయిన రభసను భార్యకు జూపి యాష్టపడ్డాడు వెంకట్రామయ్య. మహాలక్ష్మమ్మ ఎటూ చెప్పలేకపోయింది. మిడిగుడ్లుబెట్టింది. ఏదో వేలువిడిచిన తమ్ముడుగదా అనీ, మరీ పిచ్చిసన్యాసి చెడిపోతాడనీ భావించి ఈపెళ్ళిచేసి, కాళ్ళకు బంధాలువేసి వొక యింటివాణ్ని చేద్దామనుకొంది. చేసింది. కానీ ఈ దౌర్భాగ్యుడు తన మాట నిలబెట్టి చచ్చిందేదీ? కాస్త యీవుమ్మదం తీరిందాకానన్నా వొళ్ళు దగ్గిరబెట్టుకొని ప్రవర్తిస్తే బాగుండేది.

శ్రీపతికి యిక్కడవున్నందువల్ల లాభంలేదని తెలిసి పోయింది. ఏదో మామగారిని అడ్డంపెట్టుకొని చక్రం తిప్పుదామనుకొన్నాడు. మామగారైనా మరీ దరిద్రుడుగాదు. ఇంత కలవాడు. ఇంకా యింత ఆర్జిస్తున్నవాడు. కాస్తోకూస్తో ఘరానా మనుషులతో పరిచయమున్నవాడు. నీళ్ళా మంటూ కాలం గడవకపోతుందా అనుకున్నాడు. కానీ గడవలేదు. మామగారు మాట్లాడటం దాదాపుగా మానేశాడు. మరదలు, బావమరదీ సరేసరి. అదేం ఖర్మమోగానీ అతగాడంటే పిల్లలకు సరిపడదు. పెళ్ళాంగనక సావిత్రికి మాట్లాడక తప్పదు. అదీ కట్టె విరచి పొయిలో బెట్టినట్టు. మహాలక్ష్మమ్మగారే అందరివిలవా మాట్లాడేది. "ఈ తద్దినం మనకెక్కడ చుట్టుకొందిరా బాబూ" అన్నట్టుండేవి అందరిచూపులూ.

ఒకనాటి వుదయం భార్యను ప్రయాణంచేశాడు శ్రీపతి.

"ఎక్కడికీ ?" అన్నాడు వెంకట్రామయ్య.

"మా యింటికి. ఇక్కడెందుకూ? ఉన్న నాలుగు రోజులూ జరిపినమర్యాదలు చాలు, మళ్ళీ జీవితాంతంవరకూ కొంపచాయలకు రాకుండా జేశారు. ఇక్కడేముందని వుండను? ఎవరికోసమని వుండను? వుండవలసిన మనిషేదో నాతోనే వొస్తోంది, ఇక మీకూ నాకూ రాం రాం. బ్రతికుంటే ఏనాటికైనా కలుసుకోలేకపోము" అన్నాడు గంభీరంగా ట్రంకు పుచ్చుకొని.

వెంకట్రామయ్య మనస్సు చివుక్కుమంది. నిజంగా నేనేమయినా అతనికి అవమానం చేశానా?" అని సింహావలోకనంచేసుకొన్నాడు. ఒకవేళ చేసినా అది అతన్ని కించపరుద్దామని మాత్రం కాదు.

ఎవ్వరినుండీ సమాధానం రాకముందే శ్రీపతి బయలుదేరాడు. ఇంతవరకూ తలుపు చాటుగా నుంచున్న సావిత్రి గూడా భర్తని అనుసరించింది. వాళ్ళు నాలుగడుగులు నడిచిందాకా చూసి, తరువాత కూతుర్ని వెనక్కుపిలిచి, పాతిక రూపాయలు చేతిలోబెట్టి 'దేనికయినా అక్కరకొస్తాయి దగ్గరుంచుకో అమ్మా. నిన్నిట్లా పంపించటానికి ప్రాణం వొప్పటల్లేదు, ఏంచేసేది? ముందుగా చెబితే నలుగురితోపాటు నేనూ కలిగిందేదో పెట్టి పంపించేవాణ్ని. ఇప్పుడేం చేసేది?' అన్నాడు కూతురు తల నిమురుతూ కళ్ళ నీళ్ళుబెట్టుకొని. సావిత్రి గూడా వొక్కసారి కళ్ళు తుడుచుకొని ముక్కు ఎగ

ఏల్చి 'ఫర్వాలేదులే. నాన్నా! ఆమాత్రం దయుంటే అంతే చాలు' అన్నది.

శ్రీపతిబైటనుండి కేక వేశాడు. 'వెళ్ళగానే వుత్తరం ముక్క రాసిపడెయ్యమ్మా' అంటున్న తండ్రిమాటల్నిగూడా వినిపించుకోకుండా భర్తను అనుసరించింది సావిత్రి.

శ్రీపతి నేరుగా తనింటికి వెళ్ళలేదు. తన పినతల్లిగారింటికి చేరాడు. అక్కడ నాలుగు రోజులుండి, మరో వూళ్ళో మరో చుట్టాలింటికి క్యాంపుకొట్టాడు. ఇట్లా రెండునెలలపాటు పిల్లిని తిప్పినట్లు తిప్పాడు సావిత్రిని. ఆమె ప్రతిరోజూ భర్తను అడిగేది, 'మనింటికి ఎప్పుడు పోదాం?' అని. వాడు యివ్వాళ రేపూ అంటూనే రెండునెల్లు జరుపుకొచ్చాడు. ఈలోపుగా లాలించి, బెదిరించి, సావిత్రి దగ్గర పాతిక రూపాయలూ పుచ్చుకొన్నాడు. ఒంటిమీద నగానట్రా ఖాళీచేశాడు. అన్నీ అయిపోయిన తరవాత పట్నం జేరాడు.

పట్నంలో ఎవరు ఇతని ముఖంచూసేది? అదృష్ట వశాత్తూ అతని పినతండ్రికొడుకు రామచంద్రం వుండబట్టి గానీ, లేకపోతే గతేమిటి? రామచంద్రమైనా వున్నవాడు గాదు. ఏదో కిందా మీదా పడి నాలుగురాళ్ళు తెచ్చుకోగల సమర్ధుడు. ఒచ్చిన అన్ననూ, వొదిననూ కాదనలేకపొయ్యాడు. ఉన్నదాంట్లోనే కలోగంజో తాగుదామన్నాడు.

ఎవడికాళ్ళమీద వాడే నిలవటానికి అవకాశం లేని నేటి ఆర్థిక వ్యవస్థలో ఎవడుమాత్రం చిరకాలం మరొకబరువును మొయ్యగలడు? ఈ సంగతి నేరుగా శ్రీపతితో అన్నట్లయితే బాగుండేది. అన్యాపదేశంగా చెబితే తెలుసుకోగల

తెలివి తేటలు శ్రీపతికి లేవు. వున్నా వాటిని ఉపయోగపెట్టటం ప్రమాదమని తెలుసుకొనే వుండాలి.

ఆఖరికి తెగించి రామచంద్రం అన్నయ్యతో చెప్పాడు. అంతదాకా శ్రీపతి ఆవిషయాన్ని గమనించనట్టే నటించి—

"ఈసంగతి యింతకాలందాకా నాతో ఎందుకు చెప్పలా? నువ్వు మాకోసం కష్టపడటం నాకేమాత్రం సమ్మతం లేదు. ఈ సాయంత్రమే సైదాపేటకు బసమారుస్తాను. ఒక ప్రైవేటు కంపెనీలో యివ్వాళే నూటపాతిక రూపాయిల జీతంమీద పని కుదిరింది. రేపు వుదయం చార్జీ తీసుకోవాలి. ముందుగా ఎడ్వాన్సు అడిగితే బాగుంటుందా? ఒక పాతి కుంటే సరి. వారం రోజుల్లో యిస్తాను. తరువాత నువ్వుగూడా మాతోనే వుందువుగాని ఒక్కడివి. ఏం మునిగిపోతుందిలే" అన్నాడు శ్రీపతి. రామచంద్రం నానాగడ్డి కరచి పాతికా యిచ్చి వొది లించుకొన్నాడు వాళ్ళను.

శ్రీపతి ఆపేటలో ఒక దౌర్భాగ్యపుకొంపలో సావిత్రిని వుంచాడు. దగ్గరున్న పాతికరూపాయలు హరించిపోయిం దాకా పనికోసం తిరిగాడు. ఎక్కడ వుంది పని? ఎవరిస్తారు? ఇతగాడి అయిదోతరగతి విజ్ఞానం చూశా!

కూటికి మాడారు. గుడ్డకు మాడారు. నానా అగ చాట్లూ పడ్డారు. సావిత్రి తన రాతకు మొగుడు లేకుండా చూసి ఏడ్చేది. అతనుండగా ఏడవటానికిగూడా వీల్లేదు. భార్యను నెత్తురుపడేట్టు కొట్టేవాడు. జుట్టు పట్టుకొని పైకెత్తి కుదేసేవాడు. ఎవరు దిక్కు? ఆ పిల్ల భయంకరఘోష విని జాలిపడే దెవరు?

పగలల్లా ఎన్ని పోట్లాటలు పోట్లాడుకున్నా, ఎన్ని తన్నులాటలు జరిగినా, రాత్రికిమాత్రం ఏమీా వుండేది గాదు. ఉదయం నవ్వుతూ లేచేవాళ్ళు. మళ్ళీ రాత్రికే ఏమన్నా నవ్వితే!

ఈ దెబ్బలు, ఈ తన్నులు, తిట్లు సావిత్రి భరించలేక పోయింది. ఎంత ఆడజన్మ ఎత్తినా సావిత్రికూడా మనిషే గనక అభిమానానికి విరగబడేది. కానీ ఏంలాభం ?

అక్కడే వుండాలని సావిత్రి శతవిధాలా ప్రయత్నం చేసింది. లేనివోర్పునంతా కూడగట్టుకొని ఆగి చూసింది. ప్రయత్నా లేమీా ఫలించలేదు. శ్రీపతి ప్రవర్తన రోజురోజుకీ భీకరమైపోవడంతో వొక రాత్రిపూట టిక్కెట్టుకూడాలేకుండా పుట్టింటి కొచ్చిపడింది.

తల్లి, తండ్రి, చెల్లెళ్ళు, అన్నయ్య అంతా విచారించారు. రెండురోజుల దాకా ఎవ్వరూ కడుపునిండా కూడే తినలేదు.

''అంతా శ్రీమన్నారాయణునిలీల. ఈ జీవి ఇట్లా కావాలని రాసిపెట్టివుంది. అయింది. భగవంతుడి నిర్ణయాన్ని తప్పించటం ఎవరితరం ?'' అన్నది తన తప్పుని సమర్థించుకోటానికి మహాలక్ష్మమ్మగారు. ఆమె అప్పుడప్పుడు వేదాంతం పలుకుతుంది.

"ఏమిటి ఆ నారాయణుడి లీల? నాముందుకు రమ్మను చెప్పుతీసుకు తంతాను. ఇట్లా అని నాముఖాన రాసిపెట్టాడేం? నా రాత యిట్లా బూడిదయి నేను 'లబో'మని ఏడవటం నీ దేవుడికి ఇష్టమా ? ఇతరుల ఏడుపుచూసి సంతోషపడే

భ్రష్టుడు వా డేం దేవుడు ?" అన్నది సావిత్రి. తల్లి అంటే యిటీవల పరమరోత కలుగుతోంది. తన కిట్లాంటిగతి రావటానికి కారణం తల్లేనని సావిత్రికి ఖుణ్ణంగా తెలుసు. ఈవిడ పట్టు బట్టకపోయినట్లయితే శ్రీపతితో తనకు పెళ్ళి జరగనే జర గదు. హాయిగా యింకో మంచివాణ్ణి చూసి చేసుకొనేది.

వెంకట్రామయ్య గూడా సమయమొచ్చినపుడల్లా భార్యను నొక్కి-పారేస్తుండేవాడు.

"బంగారమంటి పిల్లను నీ బొంటమీద బెట్టి నీళ్ళిడి చాను. నీవంశం నిర్వంశంగాను, నీదీ ఒక బతుకేనని చెబు తున్నావా?" అంటాడు, వెంకట్రామయ్య ఏదో ఫీలు చూసు కొని. ఇట్లా అన్నందువల్ల ప్రయోజనమేమీవుండదని ఆయనకు తెలుసు; కొంచెం ఆత్మతృప్తి మినహా.

సావిత్రి ఇక్కడికి వొచ్చిన తరవాత రెండు కార్డులు మాత్రం శ్రీపతి రాశాడు. వీళ్ళు వాటి కేమీ జవాబు రాసి నట్టు లేదు. ఆ ప్రకరణం అంతటితో ఆగిపోయింది.

ఇవన్నీ జరిగేనాటికి సావిత్రికి పదహారోఏడు జొరబడింది. ఇంత కొద్దికాలంలోనే దానిబతుకు బద్దలయిపోయింది. భర్తతో సుఖంగా కాపరంచేస్తూ అతని కౌగిలింతల్లో, గిలి గింతల్లో మహత్తరసౌఖ్యాన్ని, అవాచ్యమైన ఆనందాన్ని పొందవలసినసావిత్రి; అతడులేకుండా బిక్కుబిక్కుమని మంచం మీద పడుకొంటుంది. పురుషస్పర్శలతో పులకలెత్తవలసిన రాత్రి నిర్జీవంగా, నిస్సారంగా గడిచిపోతుంది సావిత్రిపట్ల.

కొంతకాలం యిష్టమున్నా లేకపోయినా భర్తతో కాపరంచేసింది. ఆరోజుల్లోనే మగవాడిస్పర్శాసుఖాన్ని అను

భవించింది. అందుకనే పగ లెంతగా భర్తతో రద్దీపడ్డా, రాత్రికి లొంగిపోయేది. ఆ పదినిమషాల కాలమూ మంచిచెడ్డలు, ఉచ్చనీచాలు తెలియనియ్యదు. విచారించటం ఆ తరువాత సంగతి. సావిత్రి యవ్వనంలో వుంది. అందులో కొంతకాలం అలవాటుపడిన ప్రాణి. వయసునెత్తురు చేసే తిరుగుబాటు, వయసు హృదయం త్రొక్కే పరవళ్ళు, వాళ్ళ ఆత్మల రసనా వాంఛలు, ముదివగ్గులకు తెలీదు. తృప్తిపడా కామంతీర్చు కొని, పిల్లల్ని కని, వోపిక చచ్చినవాళ్ళు "కామం అణుచు కోండి" అని ఎన్నైనా నీతులు చెప్పవచ్చు. పాపిటలో వెంట్రు కలు నెరిసినతరువాత పతివ్రతలుకానివా ళ్ళెవరు గనక!

కూతుర్ని మహాలక్ష్మమ్మగారు మహాజాగ్రత్తగా కాపా డుతోంది. సావిత్రి తల దువ్వుకోటానికి లేదు. దువ్వుకొన్నా ముచ్చటగా జడ వేసుకోటానికి లేదు. కాస్తంత యిస్త్రీ చీర కట్టుకుంటేను, సబ్బుతో తోముకుంటేనూ మహాలక్ష్మమ్మగారు మొఖం మాడ్చుకొంటుంది.

'ఏమిటమ్మా మరీ విరగబడి చస్తున్నావూ? ఆ నవ్వు లేమిటే? ఆ జుట్టు పైకెగదువ్వటా లేమిటే? ఆ సబ్బు లేమిటే? ఇదేమన్నా భోగంకొంప నుకున్నావా? సంసారికొంప నను కున్నావా? ఎవడు చూసి మురవనూ మనసంబండం? తక్కువ నోములు నోచినప్పుడు తక్కువ వరాలుగాక ఎక్కువరమ్మంటే ఎక్కణ్నుంచి వొస్తై?" అంటుంది కూతుర్ని. తను చక్కగా అగరునూనె రాసుకొని, సబ్బుతో ముఖం కడిగి, చలవ చీర కట్టుకొని ముస్తాబై.

సావిత్రి ప్రాణంచచ్చి వూరుకొనేది.

కూతుర్ని ఘడియసేపు బైటవుండనియ్యదు! నవ్వని య్యదు. పత్రికలు చదవనియ్యదు.

'పత్రికలు చదివేవాళ్ళు చెడిపోతారు' అంటుంది మహాలక్షమ్మగారు.

తల్లి ఎన్ని చెప్పినా సావిత్రికి నచ్చలేదు. కామం గుడ్డిదట. అది మానవుణ్ణి పశుసమానుణ్ని చేస్తుందిట, దాన్ని అణచు కొంటేనే ఇహమైనా, పరమైనా దొరుకుతుందట. భృకుటీమధ్యంలో వెలిగే జ్యోతి కనిపించాలంటే కామాన్ని చంపుకోవాలట బాగానే వుంది. తన కిన్ని శ్రీరంగనీతులు చెప్పే తల్లి కామాన్ని చంపుకొందా? ఇంతమంది పిల్లలు కలిగినాక గూడా అర్ధరాత్రప్పుడు ఆ 'గుసగుస' లేమిటి? తనకు తెలీదనుకొంది గావును.

ఎందు కీ దొంగజీవితం జీవించటం? ఫలానా వస్తువు 'నీచం' అని అనుకొంటూ దాన్నే అనుభవించటం దేనికి? మానరాదూ? మానటానికి అసాధ్యమైతే 'నీచం' అనుకొని అనుభవించకుండా 'మంచి' అనుభవిస్తే ఏం?

సావిత్రి యీ వాదన సవ్యమైనదే! కాని వొప్పుకో గల ధైర్యవంతు లెంతమంది!

మహాలక్షమ్మగా రెన్ని చెప్పినా కూతురు ప్రవర్తన మారలేదు. అయితే సావిత్రి చేస్తున్న తప్పేమిటి? కాస్త శుభ్రంగా వుండటమా? ఏం అలంకరించుకొంటే? ఏం కొంప మునుగుతుందోనని భయం! తన కూతురు తన రక్తం పంచుకొని పుట్టింది. తను పెంచింది. తనకు రాని "పాడుబుద్ధులు" కూతురు కెందు కొస్తయ్? వీటికి సమాధానం రాదుగాని ఆమెగారు

మాత్రం కూతుర్ని వెయ్యికళ్ళతో కాపాడుతుంది, పురుషుల చూపులనించి.

అయినా మహాలక్ష్మమ్మగారికి తృప్తి కలగలేదు. పుటిక్కిన ఈ భడవా 'కాలుజారి'... అయితే ఏమిటి గతి? మొగుడనేవా డొకడుంటే ఆధారంగా ఎన్ని వేషాలైనా వెయ్యొచ్చు. సర్వరోగనివారిణిలాగా వుపయోగపడతాడు ఆ దురదృష్టవంతుడు.

సావిత్రికి నిరభ్యంతరంగా రెండవపెళ్లి చెయ్యొచ్చు. కాస్త శ్రమపడి వెదికితే ఆ మాత్రం సంస్కారం కలిగినవాడు దొరక్కపోడు. దొరుకుతాడు. కాని భర్త బ్రతికుండగానే మరొక భర్తా? లోకులు ఏమనుకుంటారు? వీడు చచ్చిపోతే బాగుండును.

కూతురికి రెండో వివాహం చెయ్యటానికీ ధైర్యంలేదు. ఇదా చెప్పినమాట వినిపించుకోవటంలేదు. ఏవాడునైనా భరించవచ్చునుగానీ, వ్యభిచారవాదులను భారతదేశంలో భరించటం కష్టం, ఈ నీతిమంతుల మధ్య.

శ్రీపతి అంటే అందరికీ అసహ్యామే, ఒక్కమహాలక్ష్మమ్మగారికితప్ప. పైకి ఆమెగారు అసహ్యించుకొన్నా లోపల జాలిపడుతూనే వుంటుంది. వీళ్ళందరిమాటకేం గానీ సావిత్రికే అసలు అతనంటే ఇష్టంలేదు. ఇది పెళ్ళికి ముందునుంచీ అందరూ ఎరిగిన విషయం. భర్తతో కాపరంచేసినంతకాలమూ నిర్మలంగా చేసిందనటానికి ఆధారాలేమీ లేవు. ఇష్టంలేనివాడు, కానీ తప్పనిసరి, విధిలేక వాడితో దైహికంగా వుంటూ మానసికంగా మరొకవ్యక్తిబొమ్మను వూహించుకొని తృప్తిపడి

వుండాలి. అదిగూడా లేకుండా అంతకాలం కలిసి వుండటం అసంభవం.

వెంకట్రామయ్య తిట్టాడు శ్రీపతిని. ఆయనగారు మొదటినుంచీ తిడుతూనే వున్నాడు. భర్త కోసమని మహాలక్ష్మమ్మగారు తిట్టేంది. అనుభవించింది గనుక సావిత్రి తిట్టకతప్పదు.

ఇటీవల మహాలక్ష్మమ్మగారికి బ్రహ్మాండమైన, బుర్ర పగిలిపోయి, మెదడు జిగేలుమనే ఆలోచన వొకటొచ్చింది. సావిత్రి ఎంతకాదన్నా వయసులో వున్నది. ముంగిలాగా వుంటూనే ఎప్పుడో కొంప ముంచకపోదు. ఆ వుపద్రవం రాకుండా దీనికి పెళ్ళిచెయ్యటం మంచిది. కానీ... అదే పట్టుకు పీకుతుంది. పోతే ఆ శ్రీపతిగాణ్ణే పట్టుకొచ్చి యింట్లో పడేసుకొంటే తీరిపోతుంది. కాళ్ళకుపడిన పాము కరవక మానుతుందా? కొంతకాలం యిట్లా గడిస్తే తరువాత ఎవరిఖర్మం వాళ్ళది.

ఈ ఆలోచన వెంకట్రామయ్యగారికూడా నచ్చింది అల్లుడు ఎంత భ్రష్టుడైనా కూతురు రక్షణకోసం, తమమర్యాద మంటగలపకుండా వుండటంకోసం యింతకుదప్ప వేరుగత్యంతరం లేదు.

తిరిగి తిరిగి శ్రీపతిని పట్టుకొచ్చారు. అక్కడక్కడ మేసి కాస్త కండబట్టి వున్నాడు. నిజంగా శ్రీపతంటే రోత! అయితే వేరుమార్గ మేమిటి?

సావిత్రిగూడా భర్తనుఆట్టే అసహ్యించుకోలేదు. ఒక్కొక్క రోజు తను అనుభవిస్తున్న దారుణవేదనకంటే ఈ భర్తతో కాపురం చాల మెరుగనిపించిం దామెకు. సావిత్రితల్లిదండ్రులు ఆమె దైహికవాంఛను తీర్చారు. కాని మానసికవాంఛల

సంగతేమిటి? తన పరువుకోసం కూతుర్ని మానసికవ్యభిచారం లోకి దింపారు. అది కోరిన మొగవాడి కిచ్చి పెళ్ళి చెయ్యలేదు. అది అసహ్యించుకొని త్రోసేసినవాడితో వుండటానికి ఏర్పాటు చేశారు. సావిత్రి అతనితో కాపరం చెయ్యకపోదు, అది తన కిష్టుడైనవాడిబొమ్మను మనస్సులో చిత్రించుకొని వాడే వీడని కృత్రిమతృప్తి పడుతూ. ఈ నీచానికి సావిత్రి తల్లిదండ్రు లేమీ అభ్యంతర పెట్టరు. వాళ్ళకొకావలసిందేదో వాళ్ళు తయారు చేసుకొని నీతిని కాపాడుకొన్నా మనుకున్నారు.

—...—

# త్రిపుట

ఎండ మండిపోతున్నది. గాలి గోలగా వీస్తున్నది. బజారు బేజారెత్తి కలవరిస్తున్నది. కేరళం సరళంగా నడిచి— ఛరాలున ఆగిపోయ్యాడు. చొక్కా-గుండీలు విప్పాడు. జుట్టు సరిచేసుకొన్నాడు. ముఖంమీదినుండి కారుతున్న చెమటను వెదిమలతో చప్పరించాడు. ఉప్పగా తగిలింది. ఉమ్మలించి రోడ్డుమీద వూశాడు.

"ఎందుకొచ్చాను? నే నెందుకొచ్చాను. ఎవరికోసం ఎవరు పంపితే వొచ్చాను?"

ఈ సందేహం కేరళాన్ని బాధించింది. ఎంత ఆలోచించినా అతనికి తోచలేదు. పెదిమ కొరుక్కున్నాడు. గోళ్లు గిల్లుకొన్నాడు. పెరిగిన మీసాన్ని పంటిక్రిందకి లాక్కున్నాడు. దభీమని కాలితో నేలనుతన్ని ముందుకు నడిచాడు.

"ఓహోహో! తెలిసింది, తెలిసింది. అవును, ఒకరు పంపితే కేరళం ఎప్పుడూ రాడు. వాడికి తోచాలి; ఏనాటికైనా సరే! పరాయివాళ్ళ మాటలు విని చెడిపోయేటంత అల్పుడు గాడు కేరళం."

ఎదురుగా హోటలు కనిపించింది. అందులోకి చాలా మంది పోతున్నారు. చాలామంది తింటున్నారు. చాలామంది తిని వొస్తున్నారు. కేరళం ఉలిక్కిపడ్డాడు. అతన్ని ఏదో జ్ఞాపకం అంటబొడిచింది. మనిషి నీరసించిపోయ్యాడు—

"అబ్బా!" అన్నాడు కేరళం.

ఎవరూ పలకలేదు.

"అయ్యో!" అన్నాడు కేరళం.

ఒకరూ అతనివేపు చూడలేదు.

"ఆకలి-!" అని అరిచాడు.

ఒక పంది బురదవంటితో అతన్ని రాచుకుపోయింది. ఒక కుక్క అతని కాళ్లు వాసనచూసి "కుయ్" మంటూ రెండుసార్లు చుట్టూతిరిగి పరుగె త్తింది. కేరళానికి ఆకలవుతున్నది. అతను నిన్న మధ్యాన్నంనుండీ అన్నం తినలేదు. కడుపులో కొలిమిరగులుతూవుంది. కళ్ళల్లోనీడలువికారంగాకలవరించాయి.

తూలుకొంటూ హోటల్లో కెళ్లాడు. ఆకలి తీరిందాకా తిన్నాడు. సర్వరు మొదటినుండీ ఇతన్ని అనుమానిస్తూనే వున్నాడు. అప్పుడే తన సందేహాన్ని బైటపెడదామను కున్నాడు. ఐనా ఏ పుట్టలో ఏ పామున్నదో నను కున్నాడు. కానీ ఏ పుట్టలో ఏ పామూ లేదు. కేరళం కాష్ బల్లదగ్గర కొచ్చాడు. బిల్లు టేబిల్ మీందపెట్టి తుప్పుక్కున నవ్వాడు,

"గొడ్డు వెధవ. ఎంతలావున్నాడు! జుట్టువూడి బట్టతల అయింది వెధవకు"

"తంతాను. ఎముకలు విరగ్గొడతాను. అరేయ్ వేలాయుధం, నటేశన్, అప్పాసామీ, రండిరా! వీణ్ని పట్టుకోండి" అని కుర్చీలో కూచున్న లావుపాటి హోటల్ ఖామందు అరిచాడు. అతను పిప్పళ్ళబస్తాలాగా, అమెరికా పందిలాగా వున్నాడు. గుండ్రంగా ముందుకుసాగిన పొట్ట రొప్పువల్ల పైకీ కిందికీ కదులుతున్నది. నలుగురుమనుషులు వొచ్చి కేరళాన్ని పట్టుకున్నారు.

కేరళం జడుసుకొన్నాడు. బిత్తరపొయ్యాడు.

"ఏమి టిది? ఎందుకు నన్ను పట్టుకొన్నారు? నాదగ్గిర చిల్లిదమ్మిడీకూడా లేదు; మా ఆవిడమాట వినకుండా, ప్రొద్దుగూకినతరవాత ప్రయాణం చెయ్యటం నాదే పొరబాటు! హా ప్రేయసీ! నీ మాట వినకుండా, తలబిరుసుగా వొచ్చి నందుకు నాకు తగినపరాభవమైంది — ఈ అర్ధాన్నపు టడవి లో కనుచీకటిచాటుగా నలుగురు దొంగలు నన్ను పట్టు కున్నారు. అయ్యలారా! నాదగ్గిర 'కాసీ' గూడా లేదు. నే నబద్ధమాడటంలేదు. చిన్నప్పుడు—"అబ్దుల్ ఖాదరూ—నలు గురు దొంగలు" పాఠం నే నింకా మరచిపోలేదు. నన్ను— నన్ను విడిచిపెట్టండి. భగవంతుడు మీకు ఆయురారోగ్యైశ్వ ర్యాభివృద్ధుల ననుగ్రహించు గాక ..."

కేరళం ఇట్లా మాట్లాడుతూ నేవున్నాడు. ఫెడీ ఫెడీమని ఆ హోటలుఖామందు కేరళంమొఖంమీద కొట్టాడు. కేరళం వెనక్కు తూలాడు. సెర్వర్లు ముందుకునెట్టారు. ఖామందు పక్కకు తోశాడు. కేరళం మండిగానికి కాలుతగిలి, తూలి, ముందుకు దూకి పడబోయి, నిలబడ్డాడు. అప్పటికి చాలామంది చుట్టూమూగారు. కేరళం వాళ్ళను పరకాయించి చూశాడు. ఆతనికిఎక్కడనుండో కొత్త ఉత్సాహం ఎంత ఆపినా ఆగ కుండా పొడుచుకొచ్చింది—.

"సోదరులారా! పరమేశ్వరుని భక్తులారా!! అందరూ నిశ్శబ్దంగా కూచోండి. లేకపోతే షెర్లీ టెంపుల్ స్టేజీమీదకి రావటానికి అంగీకరించదు. క్రిందటిరాత్రి షెర్లీ టెంపులూ, నేనూ కలిసి కంపోజ్ చేసిన కొత్తగేయనాటికను ఇక్కడ ప్రద

ర్శించబోతున్నాం. దయచేసి అందరూ కూర్చోవాలి" అని
అరిచాడు. చుట్టూవున్న జనం ఫక్కుమని నవ్వారు. చిన్న
పిల్లలు "హేయ్—హేయ్" అని చప్పట్లు కొట్టారు.

"నవ్వండి. నా బతుకు... చివరికి నవ్వులపాలైంది. మీరే కాదు—నేను చేసుకొన్న భార్యకూడా నన్ను చూసి నవ్వుతుంది. అట్లా నవ్వినప్పుడు నాకు కోపం మండిపోతుంది. ఆ నవ్వే పెదిమల్ని పటకారుతో పట్టుకొని మెలిపెడదామని పిస్తుంది. కానీ దగ్గిరికివెడితే నాకోపమంతా బాగలాగా తేలి పోతుంది. మీరు చూశారో లేదో-నాభార్య మహాచక్కనిది. పచ్చగా సన్నగా వుంటుంది. నల్లనిజుట్టు, చిన్ననోరు, గులాబి రేకుల్లాంటి పెదిమలు—ఏమిటిది—ఎందుకు నవ్వుతారు?... పూర్వకవి ఏమన్నాడంటే "నక్కను, కుక్కను, చుక్కను, వక్కను, పక్కలను... ఓంశంభో! ఓంశంభో! ఇంతటిలో ఈ కార్యక్రమం ముగిసింది. ద్వితీయప్రసారం మూడు గంటల నలభై ఎనిమిది నిమిషాలకు—పదహారు పాయింట్ ఆరు ఒకటి తొమ్మిదీ మీటర్ల మీద వినవచ్చు..."

అని కేరళం రెండుచేతులూ చాపి, అల్లాబిల్లీ తిరుగుతున్నాడు. పక్కగా ఎలక్ట్రిక్ స్తంభానికి ఉడత పాకుతున్నది. కేరళం రెండుచేతులూ గుప్పిళ్ళు ముడిచి ఒకదానికొకటి రాచుకుంటూ "ఉడతా ఉడతా ఊచ్చి-సన్నబియ్యం సాక్షి" అని పాడుతూ, పాటకు సరిపోయేటట్లు, కాళ్ళతో దరువు తొక్కాడు. ఈ గలభావల్ల ట్రాఫిక్ ఆగిపోయింది. గుంపుకు ఆ చివరా, ఈ చివరా చాలాగుర్రబ్బళ్ళు, రిక్షాలు. సైకిళ్ళు... ఆగిపోయినై. అంతలోకే వొక చిన్న కారు హారన్ కొట్టింది.

జనం ఒకరిమీద మరొకరు తోసుకుని దోవయిచ్చారు. కారు మెల్లిగా నడుస్తున్నది. కేరళం కారుదగ్గరికి పరుగెత్తాడు. కమాన్‌ను పట్టుకొన్నాడు. కాస్తదూరం కారుతోబాటు పరుగెత్తి తరవాత వొక్క దూకుతో వెనక కూచున్నాడు. శరవేగంతో (!!) కారుపోతోంది...

కారు ఆగింది. కారుతో బాటే కేరళం కూడా ఆగాడు. పొద్దు వాటాలింది. మేడల నీడలు సాగుతున్నాయి. జనం రోడ్లమీద మరీ ఎక్కువయ్యారు. అజీర్తిరోగి పేగుల్లాగా, బజార్లు బిరుసెక్కి కిటకిటలాడిపోతున్నవి. కేరళం పక్కవీధికి మళ్ళాడు. అతనికి హఠాత్తుగా వొక బ్రహ్మాండమైన ఆలోచన కలిగింది. ఈ దరిద్రంతో ఎంతకాలం తను బాధపడేట్టు? ఎన్ని రోజులు పస్తులుచేసేట్టు? ఒకసారి ఒక లప్పకు లప్ప దొరికితే! తను రైల్లో పోతున్నప్పుడు - తను ఎక్కిన పెట్టె తప్ప మిగతావన్నీ పక్కకుదొర్లితే? అందరి జేబులూ, పెట్టెలూ, వెదికి డబ్బు, సొమ్ములు పోగుచేసుకోవచ్చు... ఈ ఆలోచనతో అతని తలకు దురదబుట్టింది. గోక్కున్నాడు. గోటిలో చిక్కుకొని ఒక వెంట్రుక వొచ్చింది. ఎగిరి గంతేశాడు—

"ఓహో! జన్మ తరియించెన్ నేటికి నాకోర్కె లీడేరెన్" అని పాడాడు.

"ఈ వెంట్రుక - అబ్బ - ఎంతకాలానికి దొరికింది! దీనికోసం సంవత్సరాలతరబడి తపస్సు చేస్తున్నాను! దీన్ని తీసికెడతాను. తులసిఆకుపసరు పోస్తాను. ఏడురోజులు పుటం వేస్తాను. అప్పుడు ఇది "రోమభస్మం" అవుతుంది. ఆభస్మాన్ని ఏవస్తువుకు తగిలిస్తే అదల్లా బంగారమై పూరుకొంటుంది.

బంగారం! బంగారం!! అపారమైన బంగారం. అంతలేని బంగారం. ఎటువిన్నా, ఎటుకన్నా, రంగారెడ్డి బంగారం, బంగారం సింగారం, కాలువలో కలువపువ్వూ"

కేరళానికి సంతోషం ఎక్కువైంది. తన జుట్టు తనే పీక్కున్నాడు. తన బుగ్గమీద తనే చిటికవేసుకొన్నాడు రోడ్డుప్రక్కగా నడుస్తున్నాడు.నడుస్తూనడుస్తూ ఆగిపోయ్యాడు. అక్కడ అరటితోలు పడివుంది. కేరళం దానిమీద కాలుబెట్టి జారకుండా నడిచాడు ముందుకు—

"గెలిచాను - గెలిచాను
తలచాను - వలచాను
పాచిపట్టు మరీది—
కలలోన - వలలోన
నూతిలో - గోతిలో
నాతిలో - నీతిలో
నవ్వాడు పోతన్న
రువ్వాడు అక్కన్న..."

పాడుతున్న పాట ఠపీమని ఆపి, కళ్ళు నులుముకొని, ముఖం చొక్కాతో తుడుచుకొనిచూశాడు, కేరళం. ఒకమ్మాయి తనతోబాటే - ఐతే ఎడంగా వొస్తున్నది. ఆతని మనస్సు విప్పారింది. నరాలు కిరకిరమని సల్లిచ్చినై. పెదిమ చప్పరించాడు కేరళం—

"ఓహ్హో! ఈ పిల్ల ఎంత బాగుంది! నా గుండెలను డెక్కలాగా పట్టింది. అడుగుతగిలిన పడవలాగా నామనసు ఈమెను దాటిపోవటల్లేదు, ఎంత ప్రయత్నించినప్పటికీ! దేని

కైనా అదృష్టముండాలి. తత నితంబాభోగ ధవళాంశుకము లోని అంగదట్టపు కావిరంగు నాకళ్ళను చెదరగొడుతున్నది. గురుమాపు దడిమంపు కోకంలో దోలకెడు కంపమాననితంబ కాంతి సొంపు నన్ను కదలించివేస్తున్నది. కదలించి, విదలించి, విలపించి—"

"ఏమిట్రోయ్ 'విలపించి' అంటున్నావ్? దేన్నిగురించి అది?" అన్నాడు కేశవం—వాళ్ళిద్దరూ స్నేహితులు.

కేరళం ఉలిక్కిపడ్డాడు. పడి—

"ఏమిటి?" అన్నాడు కేశవాన్ని భయంతో చూస్తో.

"విలపించటం" అన్నాడు కేశవం.

"ఏమిటి విలపించటం?"

"ఏమో? నువ్వే అంటుంటివే!"

"ఎప్పుడు? ఎప్పుడు అన్నా నా మాట నేను? ఎవరు చెప్పారు అన్నానని?"

"నేనే స్వయంగా విన్నాను"

"ఎప్పుడు విన్నావు?" బిగ్గిరిగా అరిచాడు కేరళం.

"ఇప్పుడే. చెవులతో. నీపక్కనే వుండి" అన్నాడు కేశవం.

"ఇదుగో! ఆత్మస్వరూపా!! ఒకవిషయం అడుగు తాను నిజం చెబుతావా?" అన్నాడు కేరళం ప్రాధేయ పూర్వకంగా. అతనిధోరణిచూస్తే కేశవానికి జాలేసింది.

"ఏమిటి?" అన్నాడు కేశవం.

"నిజం చెప్పాలి. రుజ నెరుగని ఖనిజంవంటి నిజం కావాలి."

కేశవం నిర్విణ్ణుడయ్యాడు. కేరళంధోరణి, వాలకమూ అతనికి ఏమాత్రం అర్థంకాలేదు. చాలాదూరంగా భయం తల నెత్తింది. అతని నొకవిధమైన ఆందోళన ఆవరించింది

"చెబుతాను. తప్పక ఒప్పే చెబుతాను. గరళకంఠుని సాక్షిగా- కేరళం, ఖనిజంవంటి నిజం చెబుతాను—" అన్నాడు కేశవం—అతన్ని అపహసిస్తో.

"నీకు—" అని కళ్ళలో నీరుతిప్పుకున్నాడు కేరళం. "నాకు తెలుసు. నువ్వు నా శ్రేయోభిలాషివి. నాతో బొంకజాలవు. నీకు - నీకు తెలుసుగదూ ?"

"ఏమిటి నాకు తెలిసింది ?"

"అదే ! అదే !!" అని రెండు చేతులతోనూ ముఖం కప్పుకొని వెక్కి-వెక్కి-ఏడ్చాడు కేరళం.

కేశవానికి అర్థంకాలేదు. ఇతనిబాధ ఏమిటి ? భార్య మరణించిందా ? ప్రియురాలు తిరస్కరించిందా ? వ్యాజ్యంలో వోడిపొయ్యాడా ? ఆ ప్రబంధువులు స్వర్గారోహణ చేశారా ? ఇల్లు కాలిపోయిందా ? ఇవన్నీ కానేకావని కేశవానికి శుభ్రంగా తెలుసు. భార్య మరణిస్తే కేరళం సంతోషిస్తాడు. అతనికి ప్రియురాళ్ళు లేనేలేరు. అతనే ఎవరికన్నా ప్రియుడుగావుంటే వుండవొచ్చుగాక. వ్యాజ్యంలో వోడిపోదగ్గవేవీ అతనికి లేవు. బంధువులు చస్తే ఏడిచేటంతటి అవసరమూ లేదు. ఇల్లు కాలిపోయినా ఫర్వాలేదు. ఎందుకంటే అది స్వంతం కాదు. అద్దె కొంప. మరి?—మరి ? ?

"ఏది ? ఏది ? ?" అని బుజ్జగించాడు అతను. కేరళం - ఏడుపు దిగమింగి, ఉమ్మి గుటకవేసి, కళ్ళుతుడుచుకొని—

"పరకాయ ప్రవేశం—" అని ఆగి ఆశ్చర్యంగా నోరు తెరిచాడు. కను లప్పళించాడు కేరళం.

"తెలీదు."

"అబద్దం."

"కాదు."

"నీదే కాదు."

"నీదే కాదు."

"మరి ఆమాట ఎట్లా తెలిసింది నీకు ?"

"ఏమాట ?" తలగోక్కున్నాడు కేశవం. ఎంతగో క్కున్నా - తనకు ఏమాట ఎట్లా తెలిసిందో తెలీటల్లేదు.

"అదే—'విలపించి'—" అని సిగ్గుతో తలవొంచు కొన్నాడు కేశవం.

"నువ్వే అన్నావుగదా !"

కేరళం ముఖం జావగా కరిగిపోయింది. కేశవం రెండు చేతులూ పట్టుకొని గుండెల కానించుకొన్నాడు కేరళం.

"త్రిమూర్తుల సాక్షిగా, నాలుగు వేదాల సాక్షిగా, పంచభూతాల సాక్షిగా చెబుతున్నాను. ఆమాట నే ననలేదు. ముమ్మాటికీ అనలేదు. నామాట నమ్ము కేశవం."

కేశవానికి ఇదంతా అగమ్యంగా వుంది. విసుగెత్తింది.

"సరే—వొస్తాను మరి. అవతల చాలాపనులున్నాయి" అని చరచరా నడక సాగించాడు కేశవం.

"అమ్మయ్య! ప్రాణం ఒడ్డుపట్టింది. జిడ్డువెధవ. ఎంతకీ వొదిలాడుగాదు. కేశవమంట కేశవం—వీణ్ని కేశవ మనటం కంటే, 'శవం' అనటం మంచిది.

కేరళం భుజంఅదిరిపోయింది ఆ లాగుడుతో. ముందుకు పోతున్న కేశవం పైమాటలు విని, వెనక్కు వొచ్చి అతని భుజం పట్టుకు గుంజాడు గుంజి—

"ఒంటికి మదమెక్కి ఏడవబోకురోయ్ కేరళం! చర్మం వొలిపించగలను. బుర్రదగ్గరబెట్టుకొని మాట్లాడు. నన్ను కేశవం అనటంకన్న 'శవం' అనటం మంచిదా? మాట్లాడవేమిట్రా పుండాఖోర్? నోరు బిగుసుకుపోయిందేం?" అని కేకలువేశాడు కేశవం.

"ఎప్పుడన్నాను నేను?" అన్నాడు కేరళం.

ఈ పిచ్చిపిచ్చి వేషాలు మనదగ్గిర సాగవు. మంచిగా వుంటేనే మంచి. కాదో, ఓచెయ్యి చూసుకొందాం రా. నోటికి వొచ్చినట్లు పేలావంటే పళ్ళు రాలగొడతాను. జాగ్రత్త" అన్నాడు కేశవం, పిడికిలిబిగించి. కేరళంముఖంమీద ఆ పిడికిలిని గుండ్రంగా తిప్పాడు.

"ఇదుగో! వెంకటనరసయ్యా!! ఎందుకు అట్లా నోరు పారేసుకొంటావు? నే నింతవరకూ ని న్నెరగను. కాదుకాదు, నిన్నెరుగుదును.కానీ,నీకొట్లో చిల్లిదమ్మిడీ వెచ్చంగూడా నేను వాడలేదు. నా భార్య వాడిందంటావా? అది దానితప్పు. రేపు వెళ్ళి దాన్ని దబాయించు. నీ యిష్టమొచ్చినట్లుతిట్టు. నడిబజార్లో నిలవేసి నీడబ్బు అణా పైసలతో పుచ్చుకో. నేను కాదనను. నా భార్యచేసిన అప్పుకు నన్ను నిలవెయ్యటం భావ్యమేనా వెంకటనరసయ్యా? భగవంతుడు ఈ పనికి మెచ్చుతాడా?" అన్నాడు కేరళం.

"దొంగవెధవ! అన్నీ వేషాలు వేస్తున్నావు. వేషాలయినా ఒళ్లు దగ్గరుంచుకొని ప్రవర్తించు. లేకపోతే పోలీసులదాకా వెళ్ళవలసివొస్తుంది" అన్నాడు కేశవం.

ఆమాట వినగానే కేరళం మలేరియారోగిలాగా వొణికాడు. నీళ్ళలో తడిసిన పిట్టలాగా కుంచుకొనిపొయ్యాడు. అమాంతం కేశవం రెండుకాళ్ళూ పట్టుకొన్నాడు.

"క్షమించు పరాత్పరా! నీ మాహాత్మ్యం తెలియక మొన్నరాత్రి నీగుళ్ళో చుట్టకాల్చాను. అపరాధం అపరాధం! మన్నించండి. ఇక జీవితంలో, ఎప్పుడూ - దేవాలయంలో చుట్టకాల్చను. ఈపాపపరిహారార్థం రెండురోజులపాటు నీగుళ్లో నీపాదాలదగ్గిర పడుకుంటాను. క్షమించండి. మీ రా మాట అన్నదాకా నేను మీపాదాలను వదలను."

కేరళం, పట్టపగలు, రోడ్డుమీద మోకరించివుండటం చూచి, చుట్టుపక్కలవారు చుట్టూచేరారు.

''ఏయ్! ఎవరు నువ్వు! లే లే లే'' అన్నారు. కేరళం లేచాడు.చుట్టూజనాన్ని చూశాడు. ఏదోగ్రహించినవాడులాగా కుడిచేయి చూపుడువ్రేలు నోట్లో పెట్టుకొని పెద్దగాఅరిచాడు.

''పిచ్చి—పిచ్చి" అన్నారు ఎవరో. "మీ దెవసం - పోలీసు లొస్తున్నారు. పోలీసులు పోలీసులు. పొండి పొండి. తొరతొరగా పరుగెత్తండి. దాక్కోండి" అంటూ కేరళం పరుగు లంకించుకొన్నాడు. విపరీతమయిన వేగంతో పరుగెత్తుతున్నాడు. రోడ్డు వెనక్కు జారుతున్నది. చెట్లు, ఇళ్ళు, స్తంభాలు బిత్తరపోతున్నాయి అతన్ని చూసి. కానీ అతను మాత్రం ఎటువేపూ చూడటంలేదు.

ఊడిపోతున్న పంచను ఎగదోపుకొంటున్నాడు. కారుతున్న చెమటను తుడుచుకొంటున్నాడు. అడ్డంపడుతున్న క్రాపును సరిచేసుకొంటున్నాడు—చాలాదూరం పరుగెత్తాడు విపరీతంగాఆయాసం వచ్చింది. డొక్కలు ఎగిరిపడుతున్నాయి. ఊపిరిపీల్చడమే కష్టమయిపోయింది. ఇక నడవలేకపొయ్యాడు. కాళ్ళు కండెలు గట్టాయి. ఒక ఇంటి వసారాలోకి జేరుకున్నాడు.

"అమ్మయ్య! ఇవ్వాళ ప్రొద్దునలేచి ఎవరిముఖం చూశానోగాని, అదృష్టవంతుణ్ని. లేకపోతే ఆ పూనమ్‌చంద్‌గాడు ఒక పట్టాన వొదిలి పెడతాడా? అప్పటికీ శాయశక్తులా పోరుకులాడుతూనే వున్నాను. ఎక్కడి డబ్బూ తిండికే చాలటంలేదు. ఇంక బాకీ లేమి దీర్చను? చెల్లించినడబ్బు వడ్డీక్రింద జమబడుతుంటే-అసలు, అసలుగానే వుండిపోతున్నది. ఐనా, ఆ వెధవకంటపడకుండా, సాధ్యమైనంతవరకూ తప్పించుకొని తిరుగుతునే వున్నాను. హఠాత్తుగా సినిమాహాలుముందు తారసిల్లాడు. కంట్లో దుమ్ముకమ్మి పరుగెత్తుకొచ్చాను. లేకపోతే, తాటితో కాలికి కట్టేసుకొనేవాడు— ఆహా! ఈగాలి ఎంత చల్లగావున్నదీ! ఇదేమిటి!! నా గుడ్డలన్నీ ముద్దముద్దగా తడిసిపోయిన 'య్యేమిటీ?"

అని కేరళం వసారాలోంచి ముందుకు చూచాడు. జోరుగా వాన కురుస్తున్నది. కనుచీకటి పడ్డది. ప్రయత్నపూర్వకంగా తప్ప, మనిషిముఖం కనిపించటంలేదు. కేరళం చొక్కావిడిచి పిండుకొన్నాడు. దానితోనే తలతుడుచుకొన్నాడు. కట్టుగుడ్డనిండా బురదచింది ఆలుగుడ్డలాగా తయారైంది. క్షణక్షణా

నికి గాలి హెచ్చుతున్నది. గాలితీవ్రతకు చినుకులు వసారాలో ప్రవేశిస్తున్నాయి. అతను గడగడ వొణుకుతున్నాడు. ఇక్కడ వుండటం ప్రమాదమని గ్రహించాడు. వాన వెలిసిందాకా ఈ యింట్లో తలదాచుకోవటం మంచి దనుకొన్నాడు. అనుకొని మెల్లిగా తలుపుతట్టాడు.

"ఎవరండీ?"

"నేను—నేను—" అన్నాడు కేరళం.

"ఆ దిక్కుమాలిన సినిమాల కెళ్ళొద్దండీ అని మీ కెన్నిసార్లు చెప్పినా వినిపించుకోరు. పెడసరంగా వెళ్ళారు. వెళ్ళి ముద్దముద్దగా తడిసొచ్చారు. ఇందాకనే నామాట విన్న ట్టయితే ఈ గిజాటంతా లేకుండాపోనుగదా! నామాటంటేనే మీకు తుస్కారమాయె, ఎందు కింటారూ?..."

తలుపులు తెరుచుకున్నాయి. హోరుగాలి జిమ్ముమని కేరళాన్ని లోపలికి నెట్టింది.

"ఓహ్! ఎవరండీ మీరు?" అన్నది ఆమె కేరళాన్ని చూసి చకితురాలై. ఇంతవరకూ ఆమె, ఆ వొచ్చినవ్యక్తి తన భర్త అనుకొంటున్నది. అట్లా అనుకొనబట్టే—ఆమాటలన్ని అన్నది. తీరా చూస్తే కాకుండాపొయ్యాడు. అందుకే ఆమె రవంత సిగ్గుపడి, రవంత నవ్వి, క్రిందిపెదిమ కరుచుకొన్నది.

"మాది పొరుగూరండీ! ఊళ్ళో కెళ్ళకముందే వాన వొచ్చింది. కాస్త వెలిసిందాకా నుంచోనివ్వండి. మీకు పుణ్య ముంటుంది" అన్నాడు కేరళం.

ఆమె లోపలకెళ్ళి దీపంతెచ్చింది. ఇంటికి మధ్యగా ముక్కాలుపీట వేసి దీపం దానిమీద పెట్టింది. దీపం, పీటమీద

పెట్టటానికి వొంగినపుడు, ఆమె మెళ్లోనగలు జిగజిగమని మెరిశాయి. పమిట కిందికి జారింది. జడ కుడిభుజంమీదుగా నేలను తాకింది. కేరళం చూశాడు. గాఢంగా నిట్టూర్పు విడిచాడు. రెండుచేతులతోనూ గుండెను గట్టిగా పట్టుకొన్నాడు. కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. కానీ, ఫోటోతీసిన అతనికళ్లు, ఆమె రూపాన్ని మనస్సులోకి నెట్టాయి. కేరళం ఆముతిన్న గొడ్డులాగా గిజగిజలాడాడు.

"ఈనాడు నాజన్మ సార్థకమయింది. నేను జన్మాంతరాలనుండి అన్వేషిస్తున్న స్వప్నసుందరి ఇక్కడ సాక్షాత్కరించింది. నిండారిన ఈ యవ్వనం, అపురూపమైన ఈ సౌందర్యం, ప్రతిరోజూ పుష్కలంగా అనుభవించే ఈమె భర్త ఏనాడు ఏపుణ్యం చేశాడో, ఏగంధర్వులు కరుణించి ఈతనికీ అందాలకాణాచిని ప్రసాదించారో తెలీదు. జన్మమంటే అతనిదే జన్మం. మిగతావన్నీ వొట్టి..."

"నోర్ముయ్. పెదిమ కదిపావంటే చెప్పు వెదకాలి పోస్తుంది..." అన్నది ఆమె. కేరళం ఆమెవేపు చూశాడు. ఆమెముఖం ఎర్రబడ్డది కళ్ళల్లో కొద్దిగా—భయపు తెరలవెనుక నీరు గ్రమ్మింది. బూచిమాట విన్న పసిపాపలాగా వొణుకుతున్నది.

"ఏమిటండీ అట్లా అంటున్నారు! మీ రెవర్ని అంటున్నారో నాకు అర్థంకావటంలేదు. ఇక్కడ మీరు, నేనూదప్ప ఇం కెవరూ లేరుగదా! మీ రీ మాటలన్నీ ఎవరిని అన్నట్లు" అన్నాడు కేరళం ఇంటినాలుగుమూలలూ పరకాయించి చూస్తో.

"ఇంకెవరన్నావుంటే, నీవీపు ఈపాటికే పెట్టివుండేది ముందు బైటికి నడువ్. లేకపోతే పెద్దగా అరుస్తాను" అన్నదామె బిగ్గరగా. ఆశబ్దం బైట వానతీవ్రతలో మారుమోగింది.

కేరళం బెదిరినగొడ్డులాగా మిర్రిమిర్రి ఆమెవేపు చూశాడు.

"అట్లా చూస్తావేం? నీకే చెప్పేది. ముందు బైటికి నడువు—వానలో తడిసిపోతున్నావుగదా అని లోపలకు రానిచ్చినందుకు- ఇదిట్రా నువ్వు చేసేపని?"

"ఏమిటితల్లీ! నే నేంచేశాను?"అన్నాడు కేరళం రెండు చేతులూ జోడించి.

"ఈవేషాలు నాదగ్గిర చాలించు. ఈనాడు నీజన్మ సార్థకమయిందా? నేను నీ స్వప్నసుందరినా? ఈయవ్వనం... అనుభవించే అదృష్టం...నీకు నో రెట్లా వచ్చింది? నీకు అక్కలూ, చెల్లెళ్ళూ లేరూ? వాళ్ళఅందం ప్రతిరోజూ అనుభవించేవాళ్ళు-వాళ్ళెంతటి అదృష్టవంతులు?తొరగా బైటికి నడు. కాసేపువుంటే వారొస్తారు. అప్పుడు నీజన్మ నిజంగానే సార్థకమవుతుంది" అన్న దామె.

"నేను—నే నా మాట అనలేదండీ! అమ్మతోడండీ! ఏవొట్టుబడితే ఆవొట్టు వేసుకొంటానండీ" అన్నాడు కేరళం ఏడుస్తూ.

ఆమె నవ్వింది. ఐనా ఆ నవ్వులో పిరికితనం ప్రతిఫలిస్తూనేవుంది. ఇక అతన్ని నమ్మటం ఆమెశ కికి మించినపని- ధైర్యం తెచ్చుకోవటంకోసరం ఆమె దగ్గింది. దగ్గి-

"ముందు బైటికి వెళ్ళు. లేదా నేనే గెంటవలసివొస్తుంది" అన్నది.

"లేదు, లేదు. నే నామాట అనలేదు" అని మూలిగాడు కేరళం.

"అన్నావు-అబద్ధమాడబోకు."

మరుక్షణంలో తలుపు తెరుచుకొని - బోనునుండి తప్పించుకొన్న మృగంలాగా కేరళం వీధిలోకి దూకి, పరుగు ప్రారంభించాడు.

అతను ఇంటికి చేరుకొనేటప్పటికి రాత్రి చాలా ప్రొద్దు పోయింది. ఐనా భార్య అతనికోసం ఇంకా మేలుకొనే వున్నది.

"ఇప్పటిదాకా ఏంచేస్తున్నారండీ?" అన్నది భార్య కేరళం ఇంట్లోకి రాగానే.

"చిత్తం. ఆలస్యమయిందండి. ఇంటిదగ్గిర ఆడవాళ్ళుతల వాకిటున్నారండీ. అందులో మాకు పెద్దదిక్కంటూ లేనే లేదండీ. అంచేత, నాలుగుమెతుకులు ఉడకేసేటప్పటికి ఆలస్యమయినమాట నిజమేనండీ! ఇంకెప్పుడూ ఇంతలేటుగా ఆఫీసుకు రానండీ!!" అన్నాడు కేరళం కొంచెం ముందుకు వొంగి, చేతులు నులుముకొంటూ.

ఆమె కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. భర్త చూడకుండా పమిటతో వొత్తుకున్నది.

"లేవండి. ఇప్పటికే చాలా ప్రొద్దుపోయింది. ఆ తడి గుడ్డలు విప్పి, మూలపడెయ్యండి. ఈలోపుగా నీళ్ళు తోడతాను. స్నానం చేద్దురుగాని..."

స్నానంచేసి, భోజనానికి కూచున్నాడు కేరళం. భార్య వడ్డించింది. ఒకసారి పదార్థాలవేపు, ఇంకోసారి భార్యవేపూ చూశాడు కేరళం. అతనికి గొప్ప సంతోషమేసింది. ఉదయం నుండీ అతనికి అన్నంలేదు. ఆకలితో కనకనలాడిపోతున్నాడు. అన్నం చూడగానే అతని ఆకలి మరింత విజృంభించింది. గబగబ తింటున్నాడు. అట్లా తినటంలోనే ఒకసారి కొలమారింది. నాలుగైదు నిమిషాలు ఉక్కిరిబిక్కిరయ్యాడు.

"ఈవిధంగా నన్ను హింసపెట్టకపోతే ఒకసారే ఏ మందో మాకో పెట్టి నన్ను చంపరాదుటే, పీడా వొదిలిపోతానుగా!" అన్నాడు కేరళం, అన్నంతినటం ఆపి, భార్య ముఖంలోకి చూస్తూ.

"ఏమిటండీ" అన్నది భార్య ఉలిక్కిపడి.

"నీనటన నాకు తెలుసు. నువ్వు చదువుకొని సంపాదించిన విజ్ఞానమంతా నీభర్తను హింసించటంలో ఉపయోగపెడుతున్నావు. పైకి నువ్వుచేసిన లేక చేస్తున్న ప్రతిపనీ బాగానేవుంటుంది. కానీ, ఆపనులిచ్చే ఫలితాలు దారుణంగా భయంకరంగా వుంటాయి. ఎంతో మేధావంతులైతేగాని నీ పనులవెనక పేరుకుపోయిన ఆ కల్మషాన్ని కనుక్కోలేరు" అన్నాడు కేరళం.

భార్య దిగాలుపడ్డది. "ఏం జరిగిందో చెప్పండి. ఒకవేళ పొరబాటున—" అంటున్నది. మధ్యలోనే-

"కాదు" అన్నాడు కేరళం- "ఇది పొరబాటుకాదు. బుద్ధిపూర్వకంగా నువ్వు కావాలనే చేస్తున్నావు. నేను బ్రతకటం నీకిష్టంలేదు. అందుకే నన్ను చంపటానికి నువ్వు వివిధో

పాయాలను పన్నుతున్నావు- కాదని బూకరించబోకు. కావా లంటే ఇప్పుడే నీకు సాక్ష్యం చూపెడతాను.

ఆమె మాట్లాడలేదు.

"ఈ పచ్చడి ఇంత రుచిగా ఎందుకుచేశావో నాకు తెలుసు" అన్నాడు కేశవం పకపకనవ్వి.

"పచ్చడి రుచిగా చేయటంగూడా తప్పేనటండీ?" అన్నది భార్య.

"పై చూపులకు గాదు. కానీ ఆలోచిస్తే-ఇందులోనే నామృత్యురహస్యం ఇమిడివున్నది నేను ఉదయంనుండీ తిండి తినలేదని నీకు తెలుసు. ఎక్కడా తినలేదని గూడా తెలుసు. ఇంటికొచ్చేసరికి ఆవురావురుమంటూంటానని గ్రహించి, ఈ రుచిగల పచ్చడి చేశావు. అసలే ఆకలిగా వున్నవాణ్ని, పైగా రుచిగల పచ్చడి, తొరతొరగా తింటాను. కొలమారు తుంది. అదృష్టవశాత్తూ ఆసందడిలో చనిపోతే, నీ శని వొదు లుతుంది. అంతేగదూ ?" అన్నాడు కేశవం కోపంగా.

ఆమెకు ఎంత అణుచుకొందామన్నా దుఃఖమాగింది కాదు రెండు చేతులూ ముఖానికి కప్పుకొని ఇంట్లోకెళ్ళింది. ఈ విధమైన నంపపుకోతను ఆమె కొంతకాలంనుండి అనుభ విస్తున్నది. ఈ చీకటిగుహానుండి బైటపడే మార్గమేమీ కను పించటంలేదు. తొలిరోజుల్లో—తీయతీయని కలలు కన్నది. ఆ కలలన్నీ చేదుమేసి దుర్భరరూపం దాల్చాయి ఈనాడు.

"అమ్మగోయ్యా! రండిరండి! ! నా భార్య నన్ను చంపు తున్నది. బలవంతాన నాగొంతు కోస్తున్నది. అయ్యలారా! అమ్మలారా! ! మరుజన్మలో మీ బిడ్డనయి జన్మిస్తాను.

నా భార్యనుండి నన్ను రక్షించండి'' అని కేకలు పెడుతు న్నాడు కేరళం.

భార్య యింట్లోనుండి గబగబా పరుగెత్తుకొచ్చింది.

''ఆగు రాక్షసీ! అక్కడే ఆగు!! ఒక్క అడుగు ముం దుకు వేశావంటే నేను గొంతు నులుముకొని చచ్చిపోతాను'' అని గొంతుమీద చేతులు పెట్టుకొన్నాడు కేరళం. ''నాకు తెలుసు. నన్ను చంపటానికి నువ్వింట్లో కెళ్ళావు. కొలమారి చనిపోతాడని ముందుగా ఊహించావు. అదితప్పిపోయేసరికి— ఇస్—ఏడవబోకు—తప్పిపోయేసరికి, గొంతుకోద్దామని కొడ వలికోసం ఇంట్లో కెళ్ళావు. లేకపోతే ఆడదానికి వంటింటిలో పనేముంటుందో నాకు చెప్పు? చెప్పవేం? గొడ్డులాగా నిల బడతావేం?''

భార్య కుళ్ళికుళ్ళి ఏడుస్తున్నది. కేరళం భార్యవేపు చూశాడు. మెల్లిగా దగ్గరికొచ్చాడు. కుడిచెయ్యి గడ్డంక్రింద వేసి ముఖం కొంచెంగా పైకెత్తాడు. ఎడమచేత్తో రేగినజుట్టు సరిచేశాడు. ఆతని కళ్ళల్లోగూడా నీళ్ళు తిరిగాయి.

''ఊరుకోవే పిచ్చిదానా! ఏడ్చి ఎవర్ని సాధిస్తావు? ఇవ్వాళ వాళ్ళకు కట్టుకుపోయినంత వుంది. అందుకనే ప్రతివా రినీ చులకనగా చూస్తారు. అదృష్టంబాగుంటే ప్రస్తుతం నేను చేస్తున్న ఓడవ్యాపారంలో రెండులక్షలు లాభించవొచ్చు. ఆరోజున ఇటువంటి వెధవలను నీ పాదదాసీలుగా ఏర్పాటు చేస్తాను. ఏడవబోకు. చూడు. నీ కళ్ళు ఎట్లా ఎర్రబడ్డాయో'' అని భార్యను ఓదార్చాడు కేరళం.

ఆమె లేచి భర్తకు ప్రక్క అమర్చింది. అతన్ని దాని మీద పడుకోబెట్టింది. పాతగుడ్డలు మడతబెట్టి మెడవరకూ కప్పింది. మెల్లిగా చిచ్చికొట్ట నారంభించింది.

"అమ్మా," అన్నాడు కేరళం మెల్లగా భార్యచెయ్యి బట్టుకొని.

ఆమె దిగులును దిగమింగి "ఊఁ" అన్నది బలవంతాన

"రేపు నేను బళ్ళోకి పోనమ్మా! సీతయ్యమేష్టారు పొద్దున గోడకుర్చీ వేయించాడమ్మా!...... నడుములన్నీ పీక్కుపోయినై. 'పులి- బ్రాహ్మణుడు' పాఠమున్నూ, 'గంగ పారుచుండు' పద్యమూ నోటకొచ్చేట్లు చదవమంటే ఎట్లా వొస్తుందో నువు చెప్పవే అమ్మా, "మా అబ్బాయికి పాఠం రాకపోయినా కొట్టవద్దు" అని రేపు పలకమీద రాసిపెట్టవు టే అమ్మా ఇంకెప్పుడూ! నిన్ను కాసీలకోసం ఏడిపించనుగా. ఏం? చెప్పవేం?" అన్నాడు కేరళం.

భార్య మాట్లాడలేదు. బరువుగా నిట్టూర్చింది. పూర్వ కాలమైతే ఆ నిశ్వాసాగ్నికి ఆప్రాంతమంతా బూడిదయి పోయేది. ఆమె తలుపు దగ్గరగాలాగి, దీపంతగ్గించి, వంటింటి గడపదగ్గిర చెంగుపరుచుకొని పడుకొన్నది.

మరో అరగంటకల్లా కేరళం ఆమెను సమీపించాడు.

"ఏమిటండీ?" అన్నది భార్య.

"ఇస్. వెర్రిమొఖండానా, బిగ్గరగా అరవబోకు" అని ముక్కుమీద వేలు వేసుకొన్నాడు కేరళం. "నీ కొక మహా

రహస్యం చెబుతున్నాను. ఇది ఎవరికీ చెప్పబోకు. చెప్పావంటే నీ ప్రాణమూ, నాప్రాణమూ తక్షీమని ఎగిరిపోవటం ఖాయం. నే నిప్పుడే అతన్ని చంపివొస్తున్నాను...''

"ఎవర్ని?"అన్నది భయంతో ఆమె. కేరళం ఆమె నోరు మూశాడు.

"అందుకే ఈ ఆడజాతికి ఏవిషయమూ చెప్పగూడదంటారు- వాణ్ని- ఆ రావుబహాదూర్ రంగనాథంగాణ్ని. మెల్లిగా, వెనుకవేపునుండి లోపలకు ప్రవేశించాను. అందరూ నిద్రలు పోయిందాకా, ఆ దానిమ్మచెట్లో దాక్కున్నాను. బహుజాగ్రత్తగా, అడుగుల్లోఅడుగు వేసుకొంటూ, రంగనాథంగాడిగది చేరుకున్నాను. గాడిదకొడుకు తాళంచెవులు దిండుకింద బెట్టుకొన్నాడు. అమాంతం ఎగిరి వాడిగుండెలమీద కూచున్నాను. కిక్కురుమనకుండా కసకసకస గొంతు నులిమి పారేశాను. భోషాణంలో కట్టలకుకట్టలు నోట్లు, చిత్తుచిత్తుగాపడి వున్నాయి. బంగారమూ, నోట్లూ మూటగట్టుకొని వొస్తుంటే వెధవది చీకటాయె – అప్పటికీ జాగ్రత్తగానే వొస్తున్నా – ఏతేనేం? వాకిట్లో ఫ్ల్యాన్ను తొక్కాను. వాడు అరిచేలోపుగానే కత్తిసి గొంతులోకి దింపి, ఇటూ అటూ నెరిమి దాడు తీశాను – ఇవిగో! ఈ నోట్లు, బంగారమూ జాగ్రత్తగా దాచిపెట్టు. రే పొకవేళ పోలీసులొస్తే—శతవిధాల రారనుకో— వొస్తే, నేను రాత్రినుండీ కదలలేదనిమాత్రం చెప్పు; ఇంకేం అక్కర్లేదు – జాగ్రత్త! ఇక నేను వెళ్ళి పడుకొంటాను... ఇదుగో! ఎందుకైనా మంచిది, ఒకసారి నాచేతులు పరీక్ష చూడు'' అన్నాడు కేరళం చేతులు భార్యముందుకు చాపి.

"ఎందుకు? ఏమిటి చూడమంటారు?" అన్నదామె గుండె చెరువయి.

"నెత్తురుమరక లేమన్నా వున్నాయేమోనని. పోలీసులు కాలాంతకులు. ఆవలించితే పేగులు లెక్కపెడతారు" అని నీళ్ళతో కడుక్కొని, గదిలో కెళ్ళి పడుకొన్నాడు కేరళం...

—తెల్లవారింది. చాలా ప్రొద్దెక్కిందిగూడాను. ఐనా ఇంట్లో ఎవ్వరూ లేచినట్లు అలికిడిలేదు. ఇరుగుపొరుగువారు తలుపులు తట్టారు. బిగ్గరగా పిలిచారు. జవాబు రాలేదు. తలుపులు పగులగొట్టి లోపలకెళ్ళారు. అక్కడి దృశ్యంచూసి స్తంభీభూతులైనారు. కేరళం భార్య నేలమీద పడివున్నది. ఆమెగొంతు సగంవరకు కోయబడింది. నెత్తురుతో ఆప్రాంత మంతా తడితడిగావుంది. జుట్టు చిందరవందరగా రేగి కొంతా, నెత్తురులో తడిసి, నేలకుఅంటుకుపోయికొంతావున్నది. నాలుక పళ్లమధ్యగుండా భయంకరంగా వెళ్ళుకొచ్చింది. కళ్ళను అప్పటికే చీమలు పీక్కుతింటున్నాయి. కొందరు కేరళం గదిలో కెళ్ళారు. అతనికి దాపులోనే వాకకొడవలి నెత్తురుతో తడిసి పడివుంది. అతనిపొట్ట బద్దలుగా చీల్చబడివుంది. పేగులు వికృతంగా బైటికి తోసుకొచ్చాయి. రక్తంతో ఆ పరిసర మంతా చెక్కుగడుతున్నది.

"పాపం!" అని నిట్టూర్పు విడిచారు.

"దిక్కులేని చావు చచ్చారు" అని సానుభూతి చూపించారు.

కానీ ఆ చావులకు కారణాలేమిటో ఎవ్వరూ శ్రద్ధగా పరికించలేదు. కేరళం ఎందుకు చనిపొయ్యాడు? అతను ఆత్మ హత్య చేసుకొన్నాడా? లేక, హత్య చెయ్యబడ్డాడా? ఆత్మ హత్యే ఐతే, దానివల్ల ఏమి సాధించా లనుకొన్నాడు? హత్య చెయ్యబడితే హంతకునియొక్క—లేక—హంతకియొక్క ఉద్దేశ్య మేమిటి? కేరళంభార్య ఎందుకు చనిపోయింది? ఇది ఆత్మ హత్యా లేక హత్య చెయ్యబడటమా? ఎందుకు చనిపోయింది? లేదా ఎందుకు హత్య చెయ్యబడింది? ఇత్యాది వేలాదిప్రశ్నలు ప్రశ్నలుగానే వుండిపొయ్యాయి. కానీ ఆప్రశ్నలతోలూాకు వ్యక్తులుమాత్రం దాటిపొయ్యారు.



# సాంఘిక విలువ

ఏభై ఏళ్ళ కిందట "కుమారు" వాళ్ళు శ్రీమంతులు. అప్పుడు వారిపేరు తెలియనివారంటూ ఆచుట్టుప్రక్కల ఎవరూ లేరు. వారు భాగ్యవంతులు కావటమే యిందుకు కారణమని కిట్టనివాళ్ళు అంటూంటారు గాని, అది నిజంకాదు. ముష్టి రెండువందల ఎకరాల పల్లపు పొలం లోకంలో ఎంతమందికి లేదుగనక? వాళ్ళందరికీ యిటువంటి కీర్తి ప్రతిష్ఠలు వొచ్చినయ్యా మరి? డబ్బును పెట్టెల్లో పెట్టి దాచుకోవటంగానీ వ్యాపారంలో పెట్టి పెంచడంగానీ వాళ్ళు చేసివుండినట్లయితే ఏమయ్యేదో మనం చెప్పలేము. డబ్బు ఒట్టి పాపిష్టిది. దిక్కుమాలింది. అది మానవుడికి భౌతిక బంధనాలను అధికం చేస్తుంది. మనిషిచేత అన్యాయాలు చేయిస్తుంది; అక్రమాలు చేయిస్తుంది. అంచేత డబ్బుగలవాడు పుణ్యలోకాలకు అర్హుడుగాడు. "కుమారు" వంశీయులకు ఈ లోకం మీద కంటే, పరలోకాలమీద మమకారం జాస్తి. ఇక్కడున్న నాలుగుగడియలూ సుఖంగా గడపవొచ్చు. మరి చచ్చిన తరవాతసంగతి?

అందుచేత వారు - తుచ్ఛమైన - నీచమైన - దుర్మార్గమైన డబ్బును విచ్చలవిడిగా ఖర్చుబెట్టి, భౌతిక బంధనాలను పెద్దగా తెంపుకోసాగారు. సత్రాలు కట్టించారు. బావులు, చెరువులు తొవ్వించారు. దేవాలయాలకు శాశ్వతమాన్యాలిచ్చారు. కొన్ని దేవాలయాలను స్వయంగా నిర్మించారు. ఆకాలంలో వారింటినిండా బంధువులుండేవారు. ఆయింటో

వున్న ఆవుపెయ్యి వొకరోజు గడ్డితినకపోతే, ఎనిమిది ఆమడల దూరాన వున్న నాలుగు తరాలనాటిబంధువు సకుటుంబ సపరివారసమేతుడై వచ్చేసి, నెలరోజులపాటు, ఆవుపెయ్య రక్షణ బాధ్యత తీసుకొన్న సమయాలూ వున్నయ్. తమమీద ఇటువంటి 'ఆదరం' చూపించినందుకుగాను, ఆ కుటుంబానికి యథోచిత సత్కారాలు కూనూరువారు చెయ్యటమూ కద్దు.

చలమయ్యగారు భూశయనం అలంకరించబొయ్యేవరకూ 'ల' కేత్వమూ, 'ద' కు కొమ్మూ ఇవ్వలేదు. చావబొయ్యే ముందుగూడా, వొక బంధువు పెళ్ళికి నూటపదహార్లు యివ్వమని కొడుకుకు సైగచేసి మరీ చచ్చాడు. అటువంటి ధర్మాత్ముడు చలమయ్యగారు. తండ్రి చచ్చినతరువాతగూడా బసవయ్య - చలమయ్యగారి ఏకపుత్రుడు—తండ్రి సాంప్రదాయాన్ని విడవలేదు. అయితే ఒకటిమాత్రం నిజం. చలమయ్యగారంత దొడ్డహస్తంమట్టుకు కొడుకుదిగాదు. కాస్త వెనకా ముందూ పారజూసేవాడు. అట్లాచూడటంలోనే, ఒకసారి వెనక్కి చూసినప్పుడు, తండ్రి చేసిన ఇరవైవేల రూపాయల అప్పు బసవయ్యకంటబడింది. ఈ అప్పు ఏసందర్భంలో చేసిందీ వివరాలు తెలియలేదు. తండ్రిగూడా అటువంటి అప్పు వున్నట్లుగా ఎప్పుడూ కొడుకుతో చెప్పినట్లులేదు. బసవయ్య కాసేపు ఆలోచించాడు. తన తండ్రి అప్పు చెయ్యవలసిన అవసరం ఏమీలేదు. అయితే చెయ్యలేదనటానికి ఆధారాలుగూడా ఏమీలేవు. ఆయన తనతో చెప్పకుండానే అనేక కార్యాలు చేశాడు. అటువంటివాటిల్లో ఈ 'అప్పు' గూడా ఒకటై వుండవొచ్చు.

బసవయ్యఆలోచన చూసిన తరవాత బాకీదారుకు - చలమయ్యగారి మేనమామ షడ్డకుడి పెనతల్లి ఆడబిడ్డ కొడుకు గారికి భయంపట్టుకుంది. ఏమిటీ ఈ నోటువేపు తెగ చూస్తున్నాడు? ఈ సంతకం ఫోర్జరీదని కనిపెట్టిచచ్చాడా ఏమిటి? ఇరవై వేలరూపాయలు వొడుపుకొంటే, ఆ బాడవచక్క కాస్తా కొనుక్కుందా మనుకొన్నాడు తను. పీడు వుండివుండీ —వెధవవాలకం చూస్తుంటే సున్నాచుట్టేట ట్టేవున్నాడు. అంతగా పీకెమీదికొస్తే నవ్వుతా చేశాలే బావా!" అని తోసిపారవెయ్యవచ్చుననుకో. అసలు అదిగాదుగా విషయం. కుర్రసన్యాసులకు వుంటుందని ఆ కాస్త పొలంచెక్కా కొని పడేస్తే...

"మా నాన్నగారికి బాకీ చెయ్యవలసిన అవసరం కలగ కూడదుమరి. కలిగిందని ఈ నోటే చెబుతోంది. నువ్వు మా బంధువుడివి. మా క్షేమాన్నికోరే నువ్వు మా యింట్లోవుండి వున్నావని నేను నమ్ముతున్నాను. ఈ ఇరవై వేల రూపా యలు ఆ ధర్మాత్ముడు ఏ సత్రానికో 'కానుకగా' యిచ్చి వుంటాడు. ఇప్పుడు నేనేమీ ఆయనగారి ననను. చచ్చి ఏస్వర్గ లోకంలో వున్నాడో మహానుభావుడు... కానీ తప్పనిసరైంది. ఆయనగారి కడుపున పుట్టిన నేను అనటం భావ్యం కాదనుకో. తప్పటంలేదు. ఇరవై వేల బాకీ అక్షరాల నిజం. నువ్వు కాదూ కూడదంటే దమ్మిడీతో సహా కట్టాలి. నామీద దయవుంచి పదిహేను వేలు యిస్తాను, తీసుకొని ఈ నోటును రద్దుచెయ్యి. అంతకంటే నిన్ను కోరదగిందేమీలేదు" అన్నాడు బసవయ్య నోటును బాకీదారు చేతుల్లోపెట్టి.

బాకీదారు, మరొక పదివేలు ఎక్కువరాయసందుకు విచారించాడు.

నేను కటికి రొక్కం మీ నాన్నగారి చేతులో పోశాను. వడ్డీగూడా కట్టుకొంటే చాలాఅవుతుంది. ఆయనగారు బ్రతికి వున్నట్టయితే నాకీకష్టముండేదికాదు. అసలు డబ్బుకోసమనే నేను మూడునెలలనుంచి మీయింట్లో కుటుంబంతో సహా వుంటున్నాను. అడుగుదాం అడుగుదాం అనుకుంటూనే ఆయనగారిముఖంచూసి అడగలేకపొయ్యేవాణ్ని. సరే, కానివ్వు. వడ్డీమాత్రం తీసేసి—నాఅసలు నాకిప్పించు. నేను విచారిస్తూ తిరిగిపోవటం నీకు మాత్రం జయమా? స్వర్గంలోవున్న తండ్రిగారి ఆత్మ, నా విచారం తెలిసి ఎంత దురపిల్లుతుంది?... పిల్లలుగలవాణ్ని.నన్ను అన్యాయం చెయ్యటం న్యాయంకాదు. నిజానికి నిన్ను ప్రాధేయపడవలసిన అవసరం నాకులేదు. కోర్టులున్నయ్. కాని, అంతదూరం పోవటం నా కిష్టంలేదు...»

పద్దెనిమిది ఎకరాలిచ్చి ఆ నోటును బసవయ్యగారు రద్దుచేసుకొన్నాడు. తండ్రిగౌరవం నిలబెట్టటంకోసం బసవయ్య చాలా ప్రయాసబడ్డాడు. మునుపటంత జాస్తిగా కాకపోయినా 'లేదు' అనిమాత్రం కొడుకు అనటంలేదు. ఒక్కొక్క రాయి చొప్పున తీస్తే కొండలంటివి తరిగిపోతయ్. ఆస్తుల లెఖ్ఖేమిటి? బసవయ్యగారి ఆస్తులు కొండలుకావు మరి. ఆ ఆస్తిని వాళ్ళు 'కీర్తి'గా మార్చుకొన్నారు. ఈ క్షణాన బసవయ్యగారికి మూడెకరాలపొలం - అదీ తాకట్టులోవుంది - మాత్రమే వుండవొచ్చు. కానీ ఆయనగారికున్న కీర్తి అపారం. తండ్రిని మించిన చెయ్యి అనే పేరు గడించుకొన్నాడు. తండ్రికంటే

ఎక్కువగానే భౌతికబంధనాలను తెంచుకొన్నాడు. ఆస్తి తగ్గి పోయింది. దీనితో బాటే బంధువులూ తగ్గిపొయ్యారు.

శేషగిరి పుటకలకు బసవయ్యగారు చాల బీదదశలో వున్నాడు. ఆయన చుట్టాల్ని పిలువలేదుకదా అని ఎవరూ బాధపడలేదు. అతి దగ్గరగావున్న నలుగు రైదుగుర్ని మాత్రం పిలిచాడు. పాపం! వాళ్ళు 'అనివార్య' కారణాలవల్ల రాలేక పోయారు. బసవయ్య చాలహీనంగా బారసాలజరుపుకున్నాడు. ఇలువంటిస్థితి వొస్తుందని ఆయన ముందుగా ఊహించా డేమో మనకు తెలీదుగానీ, వొచ్చినందుకు మాత్రం విచా రించవలసినంత ప్రబలంగా విచారించ లేదు.

శేషగిరి చదువు ఆరోతరగతితో ఆగిపోయింది ఆపైన చదవటానికి పట్నం పోవాలి. బసవయ్యగారికి పంపిద్దామనే వుంది. కానీ డబ్బు — వెధవడబ్బు — పాపిష్టిది— అదిలేదు. ఈ లోకం కేవలం డబ్బుమీదనే నడుస్తున్నట్టుగా ఆయ నకు తోచసాగింది. ప్రతీపనీ ప్రతీ వ్యవహారమూ ఆఖరికి పూజ చెయ్యటానికి కూడా 'అణా' కొబ్బరికాయ కావాలి. అణా! ముష్టిఅణా! డబ్బును విచ్చల విడిగా ఖర్చుపెట్టటం అంత ఆరోగ్యకరమైన విషయం కాదనే సత్యం అతనికి కొద్దికొద్దిగా తెలియరాసాగింది. లోగడ ఆయన దాతృత్వాన్ని అభినందిం చిన గుంపు, ఇప్పుడు ఆయనకు ఎదురుపడటానికే భయపడు తున్నారు. బసవయ్య కూటికిగూడా కటకటపడుతున్నాడని అందరికీ తెలుసు. ఏ క్షణాన్నయినా అతనికి తమ సహాయం అవసరం కావొచ్చు బసవయ్యగనుక పిచ్చివెధవ — దానా లనీ, ధర్మాలనీ, సత్రాలనీ, పనికాడనీ సర్వం ధ్వంసంచేసు

కొన్నాడు. పేరు ప్రతిష్ఠల కోసం, డబ్బును యింత ఇదిగా దుర్వినియోగం చేసినవాడు చివరికి కూటికి మాడి చావక ఏమవుతాడు ?

ఇప్పుడు 'కూనూరు' వారినిగురించి చెప్పుకొంటున్న ధోరణి వేరు. చలమయ్యాగారు బతికివుండే పక్షంలో, తనను గురించి చెప్పుకొంటున్న వాదులకు దిగులుపడి కుళ్ళిపొయ్యే వాడు. బసవయ్య విన్నాడు. కాని చేయగలిగిందేమీ లేదు. చేతులు కాలిపోయిన తరవాత ఎన్ని ఆకులు పట్టుకొంటే మాత్రం ప్రయోజనమేముంది? శేషగిరికి ఎవడో దౌర్భాగ్యుడు పిల్లనిచ్చాడు. ఇచ్చిన తరవాత ఆ పెద్దమనిషి పొందిన పశ్చాత్తాపానికి పరిమితి లేకపోయింది. తినటానికి తిండిలేదు. చెయ్యటానికి ఏపనీ చేతకాదు. వానలో తడిసిని తరవాతగానీ గొడుగు విలువ తెలియదు. దరిద్రం అనుభవిస్తేనేగాని డబ్బు విలువ తెలీదు. బసవయ్యగారికి డబ్బు ప్రయోజనం తెలిసింది. అది తెలుసుకొన్న తరవాత ఆయనగారు ఎక్కువకాలం బతకలేదు.

ఎవ్వరూ తమయింటికిరారు. ఎవ్వరూ పలకరు. అతి సన్నిహితులైన బంధువులుగూడా తమ బంధుత్వాన్ని తెగ తెంపులుచేసుకున్నారు. ఒంటరిగాడు. దిక్కులేదు. తాత సంపాదించిన కీర్తిగానీ తండ్రి సంపాదించిన కీర్తిగానీ చిల్లిగవ్వ విలువ చెయ్యలేదు. ఆ కీర్తయినా యిప్పుడు శ్లాఘించే దిక్కులేకుండాపోయింది.

"ఒట్టి నాప వెధవలు. పచ్చిగావున్నప్పుడు భూమీ ఆకాశం పట్టేదా? ఒకటే దొయ్యటం! కాస్త ముందూ

వెనకా చూసుకోనక్కర్లా?'' అన్నారు కొంతమంది శేషగిరి దరిద్రాన్ని చూసి సానుభూతిగా.

"ఆయనివమానానికి ఆయన మంచి అనిపించుకొన్నాడు. కానీ తన మంచి కోసం తన ముందుతరాలవాళ్ళ జీవితాలకు దిక్కులేకుండా చేస్తున్నాననే ఆలోచన లేకపోతే ఎట్లా?" అన్న వాళ్ళూ వున్నారు.

దరిద్రం కుష్ఠువ్యాధిలాంటిది. అది రాకుండా నేవుండాలి గానీ, వొచ్చిన తరవాత ఆ వంశంయావత్తూ దాన్ని భరించక తప్పదు'' అనికూడా కొంతమంది అన్నారు.

శేషగిరి అత్తవారు కొంచెం కలిగినవాళ్ళు. అయినా శేషగిరి అత్తవారి నుండి కించిత్తయినా సహాయం అపేక్షించ లేదు. దినంగడిస్తే ప్రయోజనమేముంది? తనంగడవాలి.

యశోద అర్థికశాస్త్రం చదువుకోలేదు. ఆ పిల్లకు మార్క్సిజం అంటే ఏమిటో బొత్తిగా తెలీదు. ఆమెకు కావల సినదల్లా మొదట తిండి. తరవాతశరీరసౌఖ్యం. భగవంతుడిచ్చిన ఆరోగ్యం, బలం వున్నంతవరకూ ఆ రెండోదాన్ని గురించి శేషగిరిని వొత్తిడిచెయ్యదు ఆమె! కాని తిండి కావాలి ముందు.

మొదట్లో పస్తులుచెయ్యడానికి యశోద నిరాకరించింది. 'ఎక్కడన్నా సరే తీసుకురా!' అన్నది. 'అంతకాడికి పెళ్ళెం దుకు చేసుకున్నా' వన్నది. 'మావాళ్ళు నాగొంతు బలవం తాన కోశా'రన్నది. ఏడ్చింది. శేషగిరిని తిట్టింది. తను తిట్టు కొంది. వీటివేటికీ శేషగిరి వుడుక్కోలేదు. మరొక పరిస్థితిలో

వుండినా ఈ మాటలు మహా కోపాన్ని తెప్పించవలసింది. మరి చాలా శాంతంగా యశోదకు జవాబు చెప్పాడు శేషగిరి.

బుద్ధితక్కువయి చేసుకున్నాను, చెంపలు వేసుకొంటున్నాను; ఇక్కడవుండమని నిన్ను నిర్బంధించేహక్కు నాకు లేదు. నీ కిష్టమైతేనే వుండు. లేకపోతే నిరభ్యంతరంగా పోవచ్చు. నిన్ను పోషించగలినతాహతు వొచ్చిన రోజున నిన్ను పిలిపించుకొంటాను. అప్పుడు నువ్వు రాకపోయినా విచారించను. ఎందుకంటే తిండిపెట్టలేని మనిషికి మరొకమనిషిని శాసించే హక్కు వుండదు" అన్నాడు శేషగిరి చాలాసాఫీగా!

ఈ అవకాశాన్ని యశోద వుపయోగించుకొన్నట్లయితే ఏం జరిగేదో తెలీదు; భర్త సమాధానం ఆమెకు కోపం తెప్పించింది. తాచుపాము మళ్లీ మండిపడ్డది. ఆమె కోపం ప్రదర్శించటానికి ఆ యింట్లో సరైన పాత్రసామాను గూడా లేదు.

శేషగిరి ఇంటికి రావటం తగ్గించాడు. ఒచ్చినప్పటినుంచీ భార్యపోరు అట్లా పోరుపెట్టే హక్కు ఆమె కున్నదని శేషగిరి అభిప్రాయం. అతను భార్యనోరు మూయించవచ్చు. గట్టిగా అరచో నాలుగు తన్నో ఆపని చేయించగలడు. కానీ శేషగిరి భార్య నేమీ అనదలచుకోలేదు.

ఒకొక్కసారి రెండు రోజులుగూడా రాడు. రానందున విచారపడే వాళ్ళుగూడా లేరని అతనిభావం. యశోదవున్నప్పటికీ తను ఇంటికి రానంత మాత్రాన వాపోయ్యే స్థితిలోవుండదని అతనికి గట్టినమ్మకం. కానీ జరిగేది వేరు. తిన్నా తినకపోయినా మనిషి ఆకారమన్నా కంటికి కనిపిస్తుంటే అదొక ధైర్యంగా వుంటుంది. తిండి తినలేదు. దాన్ని గురించి విచారిం

చటం ఎటుకూడీ తప్పదు. యశోద తిండితోబాటు భర్తను గురించి గూడా విచారించసాగింది. శేషగిరంత ఖండితంగా ఆవిడ తెగతెంపులు చేసుకోలేదు—

ఒక రోజున యశోద వాకిట్లో నిలబడివుంది. అప్పటికి రెండురోజులనుండీ శేషగిరి ఇంటికి రావటంల్లేదు. అందినచోటల్లా ఇదివరకే అప్పులుచేయటంవల్ల ఆవీధిలో ఇక అప్పుపుట్టలేదు. ఈ రెండురోజులూ ఆమె కేవలం మంచినీళ్లు మాత్రమే తాగి గడపకపోయినప్పటికీ, ఏపూట గూడా కడుపునిండా తిన్న పాపానపోలేదు. శరీరం తేలిపోతున్నది. స్వరం క్షీణించిపోతున్నది. ఏమీ తోచక వాకిట్లో నిలబడివుంది యశోద. ఎదురింట్లోనుంచి ఎవరో అరటికాయలుతిని తొక్కు బైట పారేస్తున్నారు. వాటివేపు ఆపేక్షగా చూసింది. ఆమెఆకలి రేగింది. కనీసం ఒక డజను అరటికాయలన్నా వుంటే బాగుండు ననిపించింది. అడక్కుండా వుండాలని గట్టిగా ప్రయత్నించింది. పాపం!ఆమెకు తెలీకుండానే ఆమెకాళ్ళు ఎదురింట్లోకి నడిచినయ్.

"అరటికాయలు బాగుంటయ్" అన్నది యశోద అక్కడున్నాయనతో.

"చిన్నప్పుడు అరటికాయలు తెగతినేదాన్ని"అన్నది కాసేపాగి.

"నెల రోజులనుండీ తిందామనుకున్నాను. వెధవద్ధి, వీలే చిక్కలేదు" అన్నది చివరికి.

అతను—అరటికాయలు తింటున్న యువకుడు—ఆమె వేపు కాసేపుచూశాడు. ఆమె కెందుకో భయమేసింది,అతను చూస్తున్న పద్ధతికి. కాళ్ళు వొణికినై. చమటపోసింది. అటూ

ఇటూ ఎదురుగా చూసింది; పోబొయ్యి పోలేక ఆగిపోయింది పాపం !

"ఎందుకూ భయం ? ఎవ్వరూ చూడరు. నాలుగు నిమిషాలు" అంటూ ఆ కుర్రవాడు వొస్తున్నాడు. యశోద చూపులు బరువుగా కిందికి జారిన అతని జేబుమీద నిల్చాయి. అక్కడనుండి కదిలేలోపుగానే అతను కదలకుండా చేశాడు ఆమెని ...

ఇంటికొచ్చింది. పగిలిపోయిన అద్దం చెక్కలో రేగిన జుట్టు సరిచేసుకుంది. పమిటతో కళ్ళు బుగ్గలు తుడుచుకుంది. ఎందుకో కళ్ళలో నీళ్ళు తిరిగినై దగ్గరోవున్న పదిరూపాయల నోటు గాలికి రెపరెపలాడింది.

సాయింత్రానికి శేషగిరి వొచ్చాడు. మనిషి తూలిపోతున్నాడు. నీరసంగా మంచానికి అడ్డంపడ్డాడు;

"అన్నానికి లేవండి" అన్నది యశోద చిల్లిచెంబుతో నీళ్ళు పెట్టి.

ఆ అంటున్నది ఎవరో్ శేషగిరికి తెలియలేదు.

"మిమ్మల్నే ! లేవండి" అన్నది బిగ్గరగా యశోద.

"నన్నేనా ? అన్నానికేనా !"

"అవును"

రెండు కూరలు, మజ్జిగతో అన్నంతిన్నాడు. తింటున్నంతసేపూ అతని కే సందేహమూ లేదు. తిన్నతరవాత కలిగింది.

"అప్పు తెచ్చాను" అన్నది యశోద బలవంతాన నవ్వు తెచ్చిపెట్టుకొని. ఆ తరవాత శేషగిరి ఆవిషయమై ఇంకేమీ మాట్లాడలేదు.

నాలుగురోజుల తరవాత ఒకనాటి మధ్యాహ్నం శేషగిరి ఎందుకో యింటికొచ్చాడు. తలుపులు గడియవేసివున్నయ్, లోపలనించి ఎవరో బిగ్గరగా నవ్వుతున్నారు. క్షణకాలం తల వంచుకొని నిలబడి గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు. సాయంత్రం అతడు ఇంటికొచ్చేసరికి కొత్తచీరతో – జరీఅంచుది – యశోద వాకిట్లో ఎదురైంది. అతనేమీ మాట్లాడలేదు. నిశ్శబ్దంగా భోంచేసి వాకిట్లో పడుకున్నాడు.

"ఇవిగో! ఈ ధోవతులు మీకు సరిపోతయ్యేమో చూడండి!" అన్నది యశోద వాక పంచలజత శేషగిరికి అందిస్తూ.

అతను తీసుకోకుండానే భార్యవేపు తిరిగి "చూడటం అనవసరం. ఒకవేళ సరిపొయ్యేపక్షంలో— సరిపోతయ్యనుకో, ఏంలాభం ?" అన్నాడు.

మీకనే యిందాక తీసుకొన్నాను, పదహారురూపాయల తొమ్మిదణాలకు. కట్టుకోండి" అన్నది యశోద ధోవతులు అలని భుజానవేసి. పదినిమిషాలు శేషగిరి ఏమీమాట్లాడలేదు. తలొంచుకొని ఆలోచించాడు. ముఖమంతా జేవురించింది. క్షణకాలం యశోద ముఖంలోకి తీవ్రంగాచూశాడు. ఆ చూపులకు తట్టుకోలేక యశోద లోపలి కెళ్ళింది.

ఇప్పుడు శేషగిరి ఆర్థికంగా ఏమాత్రంబాధపడటంలేదు. ఇటీవల ఇంటిని మరామత్తు చేయించాడు. అతనితో గ్రామం

లోని ధనవంతులకు అనేకమయిన రహస్యపుపనులు కావలసి వొస్తున్నాయి. ఎప్పుడూ అతను ఇంట్లోవుండడు. అయినప్పటికి ఆ డబ్బుగల ఆసాములు వొస్తూనే వుంటారు. ఎక్కువగా రాత్రిళ్ళు. వాళ్ళకుకావలసిన పనులేమిటో గంటలతరబడి - ఒక్కొక్కసారి రాత్రి మొత్తమూ యశోదకు చెబుతూనే వుంటారు.

శేషగిరినిగురించి తలోకవిధంగా అనుకొన్నారు. కొంత కాలంపాటు అతన్ని మనిషికిమళ్లీచూడనివాళ్ళు వున్నారు. అతనివెనక పెద్దగా నవ్వారు, అతనికి వినపడేటట్టు ఏమిటేమిటో సూటీపోటీగాఅన్నారు. శేషగిరి వస్తుతః చాలా నెమ్మదస్తుడు. వీళ్ళమాటలకు పనులకు అతనేవిగా వులుకోలేదు. అసలు వీళ్ళతోటి అతనికి సంబంధం అనవసరం. చాటున తొంభైఅరు అనుకొంటారు. అట్లా అనుకొన్నందువల్ల తనకు మునిగిపోయే దేమీ లేదు అనుకొన్నాడు శేషగిరి.

ఇట్లా వూరికినే వుండేకంటే ఏదో వ్యాపకం కల్పించుకోగూడదుటండీ" అన్నది యశోద ఒకనాడు.

"ఏం వ్యాపకం కల్పించుకొనేది? లేదు; దేనికైనా డబ్బు—డబ్బు కావాలి" అన్నాడు శేషగిరి ఎగరేస్తూ.

ఏదోవిధంగా చూసుకోవచ్చు.ఆ... సీత ం-మయ్య... అదే! పొగాకు వ్యాపారంచేస్తుంటాడే, భాగంకలవండి, ఒక్కడికీ వూపిరి తిరగటల్లేదుట, భాగస్తుడు కానాలన్నాడు."

సీతారామయ్య పావలా భాగం యిచ్చాడు. లాభం వొస్తే పంచుకోనేట్టు, నష్టమొస్తే మానుకోనేటట్టు షరతు పెట్టింది యశోద. సీతారామయ్య బిరుసు మీసాల్లోంచి, యశోదను చూసి నవ్వాడు.

కాలం కలిసివొచ్చింది. శేషగిరివాటాకు పన్నెండు వేలు లాభంవచ్చింది. ఈలోపుగానే యశోద వొక మగపిల్లవాణ్ణి కన్నది. వాడు అచ్చంగా సీతారామయ్య పోలిక. కేవలం స్నేహధర్మంకింద పిల్లవాడికి నాలుగువందల రూపాయలు చదివించాడు సీతారామయ్య.

శేషగిరి కాస్త పచ్చపడ్డాడు. చవకరేటులో పదెకరాల పొలం కొన్నాడు. సీతారామయ్యతో వ్యాపారంచేస్తున్నాడు. అతన్ని చూసి చాలామంది అసూయపడ్డారు. రకరకాలుగా చెప్పుకొన్నారు. ఆ పదెకరాలపొలము శేషగిరి కొనటంకాదనీ కోటి వీరయ్యగారు యశోదకు కొనిపెట్టాడనీ, కొంతమంది అన్నారు. అనటానికేం? కసిబోక సవాలక్ష అంటారు గిట్టని వాళ్ళు. శేషగిరి ఎవరితోటీ సంబంధం పెట్టుకోలేదు; అతను ప్రత్యేకం, అతనిల్లు ప్రత్యేకం.

ఒక రోజున వొక నాటకాల కంపెనీవాళ్ళొచ్చి యాభై రూపాయల టిక్కెట్టు కొనమన్నారు శేషగిరిని.

"ఐదు రూపాయిల్లో కుర్చీటిక్కెట్టు వొస్తుంటే యాభై రూపాయ లెందుకూ?" అన్నాడు శేషగిరి.

"ఇది కేవలం దానంగా పరిగణించాలి. ఒకానొక బీద విద్యార్థి సహాయార్థం ఈ నాటకం ఆడుతున్నాం" అన్నారు కంపెనీవాళ్ళు.

శేషగిరి నిశ్శబ్దంగా ఇంటిలో కెళ్ళివొచ్చి వందరూపాయల కాగితం కంపెనీవాళ్ళ కిచ్చాడు. కంపెనీవాళ్ళ ముఖం వికసించింది. ''చిత్తం! మీరూ అమ్మగారూ నాటకానికి తప్పనిసరిగా రండి, మీరు రాకపోతే, మాకు బొత్తుగా వుత్సాహామే వుండదు'' అన్నారు కంపెనీవారు.

తరవాత ఏవో చందాలు వొచ్చినై. అందరికంటె ఘనంగా శేషగిరి ఇచ్చాడు. ఆ వూళ్ళో హైస్కూలువుంటే బాగుంటుందని కొంతమందికితోచింది. వూళ్ళో చదువుకుంటున్న పిల్లల్లో చాలామంది పెద్దచదువులకు బస్తీలకు పోతున్నారు. ఊళ్ళోనే వొక హైస్కూలుంటే ఈ శ్రమ తప్పుతుంది. ఇంకా ఎక్కువమంది చదువుకోటానికి అవకాశాలు వుంటయ్.

నలుగురు పెద్దలూ కలసి శేషగిరి ఇంటికి వొచ్చారు. శేషగిరి వాళ్ళకు గొప్ప ఆతిథ్య మిచ్చాడు. వాళ్ళ కృషిని అభినందించాడు.

''ఇటువంటి గొప్ప సంస్థకు వంద, రెండువందలు చందా వెయ్యటం నా కెట్టే బాగుండలేదు. నాలుగు గదులు నేనే ఏకంగా కట్టిస్తాను'' అన్నాడు శేషగిరి. అందరూ సంతోషించారు. 'తాతను మించిన చెయ్యి' అన్నారు.

హైస్కూలు ఫౌండేషన్ శేషగిరిచేతులమీదుగా జరిగింది. ఆరోజున అతన్ని పూలదండలతో అలంకరించారు.

''కూనూరువారి సంగతి చెప్పవలసి వస్తే, ఎవరివల్లా కాదు. వీరితాత - చలమయ్యగారు మహాదాత. అడిగిన

వాళ్ళకు లేదన్నపాపానపోలేదు. అనేక మయిన దానధర్మాలు చేసి కాలధర్మం చెందారు. వీరితండ్రి బసవయ్యగారు గూడా తండ్రిగారి సాంప్రదాయాన్ని వొదలలేదు. ఆ తండ్రికితగిన కొమారు డనిపించుకొని దాటిపొయ్యాడు. ప్రస్తుతం శేషగిరి గారు. పులికడుపున మేకపిల్ల పుట్టదనే సామెత వీరిపట్ల రుజువయింది. మన హైస్కూలుకు నాలుగు గదులు కట్టిస్తామని మాటయిచ్చారు. కట్టిస్తారు గూడాను. మనలైబ్రరీ మరీ పాడయిపోయింది విజ్ఞాన ప్రసారానికి లైబ్రరీలు ముఖ్యంగా అవసరం. దాన్ని పునరుద్ధరించే బాధ్యత గూడా శ్రీ శేషగిరి గారే వహించాలి" అని వొకాయన వుపన్యాసమిచ్చాడు.

"నాలుగు వందలు వేసుకోండి'' అన్నాడు శేషగిరి లైబ్రరీ కార్యదర్శితో. శేషగిరి దానాలు చెయ్యటం, చందా లివ్వటం ప్రారంభించాడు అతని చుట్టాలకు అతనిమీద 'అనురాగం' తిరిగి రాసాగింది. తరుచుగా వొచ్చి అతని యోగ క్షేమాలు విచారించి పోతుంటారు. తాత, తండ్రుల సాంప్రదాయం పోకుండా నిలబెట్టాడని అంతా చెప్పుకున్నారు.

శేషగిరి మాత్రం వొక సత్యం నేర్చుకొన్నాడు. డబ్బు కావాలి. అది పాపిష్టిదే కావచ్చు. సంఘంలో గౌరవంగా బతకటానికి ఆ దిక్కుమాలింది అవసరం. మనకు హెచ్చుతగ్గులుగా గౌరవాన్ని ముట్టచెబుతుంది. అది సంపాదించిన విధానం మీద కంటే, సంపాదించిన పరిమాణంమీద సంఘదృష్టి వుంటుంది. డబ్బుగలవాడికి తెలియని విషయాలుండవు. అన్ని కళలనూ నిర్దేశించగలడు.

అతనికి 'ధ'కు 'ద'కు వున్న భేదం తెలీకపోవచ్చు. కాని కావ్యాలను విమర్శిస్తాడు. ఒక కథారచయితను, ఎట్లా కథలు రాయాలో నేర్పగలడు. సినిమా అంటే ఏమిటో అతనికి అర్థం కాని మాట నిజం. కానీ సినిమాను గురించి తెగ వుపన్యసించగలడు. డబ్బుగలవాడి వాగుడు 'అభిభాషణ' అవుతుంది. వాడి కేక 'ఉద్ఘాటన' అవుతుంది. డబ్బుగలవాడు ఈ లోకంలో కాని దేమీ లేదు. రాజకీయాలు, సాహిత్యం, చిత్రలేఖనం, అన్నీ డబ్బున్నవాడికి తెలుస్తాయి. మనిషికి కావలసింది 'విజ్ఞానం' కాదు, డబ్బు. పాపిష్టిది దిక్కుమాలింది అయినడబ్బు !

# ఎందుకైనా మంచిది

రంగారావును అరెస్టు చేశారన్న వార్తను పిడుగులాగా మా ముందు పడేశాడు నాదెళ్ళ. టిప్పుకు అర్ధణా చొప్పున ఫిల్టర్ ఆనుతున్నవాళ్ళ మంతా ఒక్కసారి యెగిరిపడ్డాం.

"ఇంతకుముందే జరిగింది" అన్నాడు చమటలూడ్చుకొంటూ.

'ఎప్పుడు' అని అడగబోయి నేను విరమించాను.

"ఎక్కడ?"

"ఎందుకు?"

"చోరీ కేసా?"

"పేకాడ్తుంటేనా?" మా వాళ్ళంతా ఆత్రుతగా అడిగారు. ఎందుకైనా మంచిదని నేను పేకనుతీసి దాచాను"

"ఆఁ ఏమీలేదు. కమ్యూనిస్టని అనుమానంమీద" అన్నాడు నాదెళ్ళ చికాకుతో విసురుకుంటూ.

"అంతేగదా," అన్నారు మావాళ్లు చప్పరించి. అంత మాత్రమే అయితే ఫరవాలే దనిపించివుంటుంది.

"రంగారావు అరెస్టువార్త వాళ్ళందరిలో ఏమో గాని నా బుర్రను కదిలించింది. నిజానికి రంగారావు కమ్యూనిస్టు కానేకాదు. రంగారావులాంటి ఆషామాషీ మనుషులకు కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వమిస్తుందని ఏనాడూ అనుకోలేను. సభ్యుడు కాకపోతే పీడాబాయె, కనీసం సానుభూతిపరుడన్నా కాదుకదా. అయితే ఒకటిమాత్రం నిజం. రంగారావుకున్న

అసంఖ్యాక స్నేహితగణంలో కొంతమంది కమ్యూనిస్టు
లున్నారు. అయినా వాడు వాళ్ళతో ఆట్టే పూసుకు తిరిగే
వాడుకూడా కాదు. వాళ్ళకుమాత్రం యీ జులాయి వెధవతో
తిరక్కపోతే వేరే పనుల్లేవా ఏమిటి? ఎక్కడెక్కడి మాల
మాదిగ గూడేలూ వాళ్ళవ్యే. ఎక్కడెక్కడి కూలిముండా
కొడుకులూ వాళ్ళవాళ్ళే. ఎక్కడెక్కడి అలగాజనమూ వాళ్ళ
దేనాయె. ఏమాట కామాటే చెప్పుకోవాలి. కమ్యూనిస్టులది
రష్యా సిద్ధాంతం అయితేఅయింది కాని వారుచేసే పనులు
మాత్రం కాస్తోకూస్తో సన్నజనానికి మెరుగ్గానే వున్నాయి.

ఇన్నిటికీ సంగతేమిటంటే రంగారావుకు కమూనిస్టు
లతో ఆట్టే పరిచయం లేదు. కమ్యూనిస్టులతో మాట్లాడడమే
గొప్పతప్పయితే రంగారావు నిస్సందేహంగా అరెస్టు కావల
సిందే. 'రామరాజ్యంలో వాక్స్వాతంత్ర్యం లేకుండా వుంటుం
దటణే' అనే పిచ్చిభ్రమకు రంగారావు లోబడి వుంటాడు.
ఎంత అమాయకుడు !

రంగారావులో ఒక దుర్గుణముంది. అది దుర్గుణమని
రంగారావు చచ్చినా ఒప్పుకోడు. సద్గుణమని మా ప్రాణాలు
పోయినా మేము అనం. వాడిలోవున్న దుర్గుణం అంత చెప్పు
కోతగింది కానిమాట నిజమే, కానీ వాడి కొంపకు చిచ్చు
పెట్టింది ఆ వెధవబుద్ధే. నిజాన్ని నిజంగాచూస్తాడు; అయితే
మేమంతా నిజాన్ని అబద్ధంగా చూస్తామని గాదు. అవసర
మొచ్చినప్పుడు నిజాన్ని అబద్ధంగా ఒప్పుకొని సమయానుకూ
లంగా నడుస్తుంటాం. 'తప్పించుక తిరుగువాడు ధన్యుడు
సుమతీ' అని వూరికేచెప్పాడా కవి ? రంగారావు దీనికి సుత

రామూ వొప్పుకోడు. "యదార్ధాన్ని వొప్పుకోడానికి ఎందుకు భయపడాలి? నాలుగు ప్లస్ నాలుగూ ఎనిమిది అనేది యదార్థం. ఎవడో చవటపెద్దమ్మ 'కాదు' పది అంటాడనుకో. అప్పుడు వాడిది ఎట్లాతప్పో మన ఆన్సరు ఎట్లా రైటో వాడికి విడమర్చి చెప్పాలి. ఇందువల్ల వాడు మూర్ఖంగా ప్రవర్తిస్తే ప్రవర్తించనూవొచ్చు. కానీ తరవాతనైనా వాడికి నిజం తెలుస్తుంది. అప్పటికన్నా వాడు తను మూర్ఖంగా ప్రవర్తించినందుకు సిగ్గుపడతాడు. హృదయమున్నవాడయితే ఎవరూ చూడకుండా ఏడుస్తాడు—" ఈ ధోరణిలో వుంటుంది రంగారావు వాదన. రంగారావుతో వాదించటమంటే మాకు మహాభయం. వాడు కొడతాడని కాదుగానీ; వెధవ మాచేత 'రైట్' అనిపించుకొంటాడు చివరికి. అంచేత వాడితో వాదానికి దిగం.

నిజాన్ని నిజంగా తనమట్టుకు తాను చూసుకున్నా బాగానేవుంటుంది. ఆ నిజాన్ని పదిమందికీ తెలియచేయాలంటాడు. పాకీవాళ్ళు సమ్మె చేశారు. సమ్మె చేయడం న్యాయమేనని మేమంతా చాటుగా అనుకొన్నాం. రంగారావుగూడా అట్లా అనుకొంటే వాడి తాతగాడిసొమ్మేం పోయింది? మునిసిపాలిటీవారికీ, షావుకార్లకీ, కాంగ్రెసువాళ్ళకీ రంగారావు మీాద కోప మొస్తుందంటే మరి రాదూ!

పాకీవాళ్లు చేసిన సమ్మె మంచిదేనని మేము ఒప్పుకొని చచ్చాంగా. వాళ్ళకు కూటికిలేదు నెలకు ఆరు రూపాయలతో కుటుంబమంతా గడవాలంటే ఎట్లాచస్తారు? వెధవది, ఆరు రూపాయలు నా సిగరెట్లకు చాలదు మరి - జీతాలు పెంచమని పాపం ముందు ప్రాధేయపడ్డారు. ఎవ్వరూ వినిపించుకో

లేదు. మంత్రులకు రాసుకొన్నారు. తమకు జీతాలు పది హేనువందలు చాల్తాయా? ఇరవైవందలు చేద్దామా? అనే అతి ప్రాముఖ్య ప్రజాకార్యంలో మునిగివుండడంవల్ల మంత్రులకు ఈ వెధవలు రాసుకొన్నది చూసేతీరిక లేకపోయింది. ఆమట్టుని వారు సమ్మెచేశారు. నాలుగురోజులనాటికి గవులు పుట్టుకొచ్చింది. ఈలోగానే కొందరు అతిసుకుమారగాత్రులూ మంచాలుపట్టారు. అయిదోరోజున కొందరు కాంగ్రెసువారు బజార్లు వూడిచారు. పెంటవిషయం వాళ్ళకు సంబంధించింది కాదు గాబోలనుకున్నాను. ఎంతమంచి వాళ్ళో! అని విస్తుపోయాను. పెద్దబజారు మాత్రమే వూడిచారు, మిగతాబజార్లు మరిచిపోయారేమోలే అని సమాధానం చెప్పుకొన్నాను. మూడోనాటికల్లా వాళ్ళఫొటోలు పేపర్లోవొచ్చినయ్.ఆశ్చర్యమేమిటంటే 'నగరం ఆమూలాగ్రంగా అసహ్యించుకొనక పరిశుభ్రపరిచిన స్వచ్ఛంద సేవకులు—'

రంగారావు పాకీవాళ్ళతరఫుమనిషయినాడు. మేము లోపల రంగారావు తరఫూ, బైట మునిసిపాలిటీతరఫు మనుషులమైనాము. అప్పటినుండే రంగారావుకు కమ్యూనిస్టురంగు పూయబడింది. ఆ తరవాత బడిపంతుళ్ళు సమ్మెచేశారు, రైల్వే కూలీలు సమ్మెచేశారు. ఇంకా ఎవరెవరో సమ్మెచేశారు. ఆ సమ్మెలు ఎట్లా న్యాయమైనవో రంగారావు మాకు వోపిగ్గా చెప్పేవాడు. వాడు చెప్పిందాన్ని విన్నతరవాత మాకు 'నిజమే' అనిపించేది. ఆంధ్రరాష్ట్రవిషయంలోనూ, హైదరాబాదు విషయంలోనూ, వాడివాదన విన్నవారు వాణ్ని చప్పున కమ్యూనిస్టుల్లోకి నెట్టిపారేశారు.

నిజంగా రంగారావు ఏ 'ఇస్టూ' కాదు. యదార్థాన్ని వొప్పుకొంటాడు. మసిబూసి మారేడుకాయ చేయలేడు. అంత మాత్రానికే రంగారావుని కమ్యూనిస్టు అన్నారు. నిజంమాట్లాడిన ప్రతివాడూ కమ్యూనిస్టే అయితే కమ్యూనిస్టు కావడానికి సిగ్గుపడవలసిందేమీ లేదు. ఇట్లా అని మేమంతా ఒకసారి అనుకున్నాము.

నిజం మాట్లాడడం, యదార్థాన్ని వొప్పుకోవడం ఈ రోజుల్లో ఎంత ప్రమాదకరమో రంగారావు అరెస్టు మాకు చూపించింది. నాలుగు ప్రజోపయోగకార్యాలు చేసినవాణ్ని కమ్యూనిస్టు అంటున్నారు. అందువల్ల ఇబ్బందేమీ లేదు.

ఏది ఏమయినా అరెస్టుకావడం మాలో ఏ వొక్కరికీ ఇష్టంలేదు. నిజం మాట్లాడి కమ్యూనిస్టు అనిపించుకో దలచలేదు. అబద్ధంమాట్లాడి కాంగ్రెసు కావడానికేవొప్పుకొన్నాం. యదార్థాన్ని వొప్పుకోడం మానేస్తే మేము కాంగ్రెసువాళ్ళమయినాం. కాంగ్రెసువాళ్ళ మయినా కాకపోయినా కమ్యూనిస్టులం మాత్రం కాదు. అంతవరకు చాలు.

ఆ సాయంత్రంనుండే మా కొత్త పథకాన్ని మేము ఆచరణలో పెట్టాము.

"రూపాయకు పదైనిమిదణాలు" అన్నాడు నాదెళ్ళ. పదహారని మాకు తెలుసు. ఆమాట పైకి అంటే కమ్యూనిస్టు కింద తోస్తారేమోనని మాభయం. మరి నిజం వొప్పుకుంటే అంతేగా!

"పంచదార కటికవిషం"

"అవునవును"

"పాలరంగు కారునలుపు"

"కాకపోవడ మేమిటి?"

"కాకులు ఎంత తెల్లగావున్నయ్!"

"మెల్లిగా అంటావేం? కళ్ళు చెదిరిపోతుంటే!"

"ఆవుకి రెండు కాళ్ళు"

"ఖచ్చితంగా అంతే"

ఇదీ మా ధోరణి.

ఇళ్ళల్లోగూడా ఇదే తంతు మొదలెట్టాం. ఆడంగులు ఆశ్చర్యపోయారు. మరికాదూ? 'అన్నానికి రండి' అన్నది మా ఆవిడ. 'కాదు, అన్నమే నాకు రావాలి' అన్నాను. 'పిచ్చిపట్టిందా ఏమిటండీ!' అన్నది. 'కాదు. పిచ్చికే నేనుపట్టాను' మా ఆవిడ రణకేక బెట్టింది. చుట్టూ ఎవరూ లేకుండా చూసి దాని చెవిలో అసలు విషయం వూదాను.

—o—

# స్వభావం

"ఏమండీ!" అన్నది రోహిణి.

"ఏమిటి?" అన్నాడు గోవిందాచారి.

"ఒక పనిమనిషిని మాట్లాడండి. ఈ చాకిరి బొత్తిగా నేను చేయులేక పోతున్నాను" అన్నది రోహిణి. ఆమెను రెండు వారాలనుండి వొంట్లో సుస్తీగా వుంటున్నది.

"నాకు తెలుసు రోహిణీ. కాని నా సంపాదన పని మనిషిని పెట్టటానికి చాలదు" అన్నాడు గోవిందాచారి. అతనికి ఏదో చిన్న షాపులో నెలకు యాభై రూపాయ లిస్తుంటారు. ఆమాట పైకి అనటానికి గోవిందాచారి ఎంతో బాధ పడ్డాడు.

"నేను చాలా దరిద్రుణ్ని. కట్టుకొన్న భార్య చిన్నకోరిక కోరితే అది తీర్చలేని అసమర్థుణ్ని" అన్నాడు గోవిందాచారి. అట్లా అంటున్నప్పుడు అతని గొంతు కొలమారింది. వాళ్ళు ఒకరి నొకరు కావాలని పెళ్ళిచేసుకున్నారు. రోహిణి కాపరానికొచ్చి నాలుగు నెలలయినా కాలేదు. ఆ పిల్ల భర్తను కష్టపెట్టటం ఇష్టంలేక అట్లాగే ఇంటిపనంతా చేయలేక చేయలేక చేసుకుపోతున్నది.

ఒకరోజు మధ్యాహ్నం ఇంటికొచ్చాడు. రోహిణి మూలుగుతూవుంది. నుదురు టకటకలాడుతున్నది. పొట్ట కాలిపోతున్నది. వెంట్రుకలు చిందర వందరగా ముఖంమీద పడివున్నయ్.

"ఏమిటమ్మా!" అన్నాడు గోవిందాచారి బుజ్జగిస్తూ.

అతను అతి ప్రేమగా వున్నప్పుడు భార్యను 'అమ్మా' అని పిలుస్తాడు. మంచంమీద కూచుని ఆమెను దగ్గరగా తీసుకున్నాడు.

"నీళ్లు తోడుతూ తోడుతూ పడిపోయాను" అన్నది రోహిణి. ఆ మాట అంటున్నప్పుడు ఆమె కొద్దిగా ఆయాసపడింది. ఆమాట అంటున్నప్పుడు గొంతులో శోకం రానున్న సూచనలు కనిపిస్తున్నాయి.

"ఇప్పుడే వొస్తాను"

"ఎక్కడికీ?" అన్నది రోహిణి.

"పనిమనిషి కోసం!"

"ఎండలోనా ? సాయంత్రం పోదురుగానిలెండి !" అన్నది రోహిణి. ఆమె భయపడింది. గోవిందాచారికి ఎండలో తిరిగితే జబ్బుచేస్తుంది. ఒకసారి ఆమెతో కీచులాడి, సాయంత్రానికి పుట్టెడుజ్వరంతో కసుకుసులాడుతూ ఇంటికొచ్చాడు.

"ఫర్వాలేదు" అని బైటికొచ్చాడు. అతనికి పనిమనుషులు ఎక్కడ దొరుకుతారో ఖచ్చితంగా తెలియదు. ఆఫీసులో పనిచెయ్యటం, భార్యతో కలసి అన్నం తినటం, ఆమెను ఎగతాళి పట్టించటం, పలచగా నవ్వే ఆమె ముఖాన్ని చూస్తూ శరీరం మరవటం తప్ప అతని కేమీ తెలియవు.

"పనివాళ్లు ఎక్కడ దొరుకుతారు?" అన్నాడు గోవిందాచారి వొకనితో. అతను కాసేపు గోవిందాచారిని, ఎగాదిగా చూసి 'సోది అడుగు' అని వెళ్ళిపోయాడు.

గోవిందాచారి పనిమనిషికోసం ఫూరంతా తిరిగాడు. ఎక్కడా దొరకలేదు. పనిమనిషిని గుర్తుపట్టడం అతనికి అసాధ్యంగా వుంది.

హఠాత్తుగా అతనికి యానాదివాళ్ళుజ్ఞాపకమొచ్చారు. ఎండలో తిరిగి తిరిగి, ఒక హోటల్లో కాఫీ తాగుతున్నాడు గోవిందాచారి. అక్కడ కప్పులు తియ్యటానికి యానాదివాడొచ్చాడు. యానాదివాళ్ళు పనిమనుషులు. యానాదివారు ఎక్కడ వుంటారో అతను తెలుసుకొన్నాడు. అక్కడకు వెళ్ళాడు. పాతిక గుడిసెలకంటే ఎక్కువగా లేవు. అవీ అనారోగ్యంగా, దుర్గంధంగా వున్నయ్.

చిటికేశ్వర చెట్టుకింద వొకడు కూచుని 'పులిజూదం' ఆడుతున్నాడు. గోవిందాచారి వాణ్ణి పలకరించాడు.

"ఏమిటండీ?" అన్నాడు యానాది.

"పని చేస్తావా?"

"చెయ్యను" అన్నాడు యానాది.

"ఊరికే కాదు..."

"డబ్బులకైనా..." అన్నాడు యానాది.

యానాదివాళ్ళు పని చెయ్యరని గోవిందాచారి అనుకొన్నాడు. ఇక ఈ పూటకు తను తిరగలేడు. ఒళ్లు కాలిపోతూ వుంది. తల నొప్పిగావుంది. ఇంటికొచ్చాడు. అప్పటికి రోహిణి లేచింది. మెల్లిగా సాయంత్రంపని చేస్తూవున్నది.

...ప్రొద్దుపోయింది. గోవిందాచారి అరుగుమీద పడుకొని వున్నాడు. శరీరం బదు వెక్కినట్లుగావుంది. బిర్రుచొక్కా

తొడుక్కొన్నట్లుగా వుంది. మెదడులో మేకులు గుచ్చుకొన్న ట్లుగా వుంది.

''అమ్మా!'' అని బిచ్చగాడు అరిచాడు.

"వెళ్ళవోయ్ వెళ్ళు" అన్నాడు గోవిందాచారి. అతను బిచ్చగాళ్ళను ఎప్పుడూ వెళ్ళమనే అంటాడు.

"ఉండ మనండీ పాపం!" అన్నది రోహిణి. బిచ్చగాళ్ళంటే రోహిణి జాలిపడుతుంది. బిచ్చగాడు వున్నాడు. రోహిణి అన్నపువెళ్ళ తెచ్చింది.

"ఇట్లా రావోయ్!'' అన్నది రోహిణి అరుగుమీద నిలబడి.

బిచ్చగాడు అరుగు దగ్గరికి వొచ్చాడు.

ఇంట్లోనిదీపం వెలుతురు బిచ్చగాడిమీద పడుతున్నది. ఆ వెలుతురులో, బిచ్చగాణ్ణి గోవిందాచారి చూశాడు. వాడు యానాదివాడు. మధ్యాన్నం తను పనికి రమ్మని పిలిచిన యానాదివాడే. అప్పుడు డబ్బులిస్తానన్నా వాడు పనిలోకి రానన్నాడు; పులిజూదం ఆడుతూ. ఈ పూట మాదా కవళానికి బయలుదేరాడు. పొద్దున్నించీ కవళం లేకపోతే, తన పనిలోకి ఎందుకురాలేదు? ఎందుకు ముష్టికోసం వొచ్చాడు?

గోవిందాచారికి భయమేసింది. యానాదివాడు మహా రాక్షసుడికి మల్లే పెరిగాడు. కొండంత తల, తాడిచెట్లంత చేతులు, గుహలాంటి నోరు, పెద్దపెద్దగోళ్ళు. జ్వాలలాంటి నాలుక.

ఆ రాక్షసుడు గోవిందాచారిని చూసి నవ్వాడు. అతనికి భయమేసింది.

"అమ్మో" అని గట్టిగా అరచి, గోవిందాచారి కళ్ళు మూసుకొన్నాడు.

"అయ్యో దేవుడా! ఏమిటండీ?" అన్నది రోహిణి. యానాదివాడికి అన్నం వేసి చెయ్యి కడుక్కొంటున్నదల్లా ఆగి, అతని దగ్గరికొచ్చింది.

"నువ్వు దెయ్యానివి. భూతానివి. రాక్షసివి. పో. పో. నన్ను చంపబోకు" అని పెద్దగా అరిచాడు, గోవిందాచారి. అతనికి జ్వరం తగిలింది.

"పాపిష్టిదాన్ని, ఎండలో బైటికి తరిమి మీకు జ్వరం తెప్పించాను" అన్నది రోహిణి, అతని చెక్కిళ్ళను మెల్లిగా నిమురుతూ.

—o—